ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవాసంఘం పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
సంచాలకుడు :
శ్రీ రామకృష్ణ ధూత్
గాంధీభవన్, :: హైదరాబాదు.

★

తొలి ముద్రణ
ఏప్రిల్, 1957
ప్రతులు : ఐదువేలు
వెల : 50 నయాపైసలు

★

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు

# संपत्तिदानमु

श्री कृष्ण दास जाजू के
'संपत्तिदान'
का
तेलुगु अनुवाद

अनुवादक :
चुंडि जगन्नाथम

पहली बार: ५,०००
मूल्य: ५० नये पैसे
अप्रैल, १९५७.

प्रकाशक:
अ. भा. सर्वसेवासंघके लिये
सर्वोदय साहित्य प्रचार समिति के
संचालक,
श्री रामकृष्ण धूत
गांधी भवन, हैदराबाद.

मुद्रक :
अजन्ता प्रिण्टर्स, सिकन्द्राबाद.

# విషయ సూచిక







# ముందు మాట



ఈ 'సంపత్తి దానము' పుస్తకము మొదట శ్రీ చుండి జగన్నాథంగారిచే అనువదింపబడింది. ఉద్యమం అభివృద్ధి చెందిన కొద్దీ క్రొత్త క్రొత్త అనుభవాల దృష్ట్యా క్రొత్త క్రొత్త విషయాలు చేర్చబడ్డాయి. హిందీలోని నాల్గవ ముద్రణను శ్రీ చుండి జగన్నాథంగారు అనువదించారు. తదుపరి హిందీలో 5, 6వ ముద్రణలు కూడ వెలువడ్డాయి. హిందీలోని 6వ ముద్రణలో జాజూజీ జీవితము, చివర ఇంకా చాల విషయాలు చేర్చబడ్డాయి. శ్రీ జగన్నాథంగారి అనువాదాన్ని, హిందీ 6వ ముద్రణతో సరిచూచే పనిని శ్రీ జి. సురమౌళిగారు చేశారు. వారికి మా కృతజ్ఞతలు. ఆ విధంగా నేటి వరకూ హిందీలో తాజా ముద్రణ అయిన ఆరవ ముద్రణతో ఈ తెలుగు అనువాదం సరిసమానంగా ఉన్నది.

హైద్రాబాదు.
22–4–'57



రామకృష్ణధూత్
ప్రకాశకులు.

# సాధుచరితులు జాజూజీ



స్వర్గీయ జాజూజీని తలచుకోగానే, ఆయన సౌమ్య సరళ విగ్రహం కన్నులకు కట్టుతుంది. స్వంతంగా వడుక్కున్న నూలుతో తయారైన తెల్లని వస్త్రాలతో అలంకరించబడి, వృద్ధాప్యంతో కృశించి పోయి వున్నప్పటికి ఆత్మశక్తిని పుంజీభవించుకొన్న ఆయన శరీరం గిరిరాజైన హిమాలయాన్ని స్ఫురింప జేస్తూ, దృఢత్వానికీ, కర్మనిష్ఠకూ ప్రతీకంగా ఉండేది. తెల్లని మీసాలు గల ఆయన ముఖాకృతి ఉదయారుణిమతో ఎరుపెక్కిన హిమశిఖరంలా ఎల్లప్పుడూ దివ్యంగా ప్రకాశిస్తూ ఉండేది. పాలవలె తెల్లనైన ఆయన కృత్రిమ పలువరుసతో, స్నేహస్నిగ్ధంగా మందమందంగా ఆయన నవ్వే చిరునవ్వు వెన్నెలవలె హాయిని కలిగించేదిగానూ మనోహరంగానూ ఉండేది. ఆయన జీవితం, తత్త్వమూ - ఆచరణా ఈ రెంటి అనుపమ సమన్వయం. ఆయన అనన్య సత్యోపాసకుడు, న్యాయ పరాయణుడు, నిస్స్వార్థ దేశ భక్తుడు, పరమ నైష్ఠిక మానవ సేవకుడు. త్యాగానికీ, తపఃపూరిత జీవనానికీ ఉత్కృష్టోదాహరణ మాయన. సత్యాన్వేషణా, న్యాయపు దారుల్లో ధర్మ భావనా ప్రేరితమైన మానవ సేవ -నే పాథేయాన్ని పూని, వారు తమ జీవిత యాత్రలో పురోగమించారు. తుదకు, పూజ్య వినోబాజీ మాటల్లో చెప్పాలంటే 'ఈశ్వరమయు' లైనారు.

## జననం - లాలన - పాలన

ఈలాటి సాధు పుంగవుడైన జాజూజీ, 74 సంవత్సరాల క్రితం 29 వ ఆగష్టు, 1882, విక్రమనామ సం॥ భాద్రపద బహుళ ప్రతిపద (1939 శకం) నాడు ఆకాసర్ (బికనేరు) గ్రామంలోని బికానేరు

మహేశ్వరీ కుటుంబములో జన్మించారు. అయితే వీరి లాలనా, పాలనా, శిక్షణా, దీక్షా అన్నీ ఆర్వీ (వార్ధా) లో జరిగాయి.

శ్రీ జాజూజీ తాతగారైన శ్రీ జగ్గణదాస్‌జీకి ఇద్దరు కుమారు లుండిరి – శ్రీ ఈశ్వరదాస్, శ్రీ మూల్‌చంద్. ఇంట్లో కిరాణా కొట్టు నడచేది. వ్యాపారం నిమిత్తం ఈశ్వరదాస్ నాగపూర్ వెళ్లి కొన్నాళ్ళ తర్వాత ఆర్వీ (వార్ధా) లో నివాసం ఏర్పరచు కొన్నారు.

## తండ్రిగారి ఔదార్యం

మూల్‌చంద్‌గారు ఉదారులైన గృహస్థులు. ఒక సారి, కరువు రోజుల్లో, హరిద్వారం వెళ్లే కొందరు సాధువులకు ఇతరత్రా ఎక్కడా భోజనం దొరక్కపోవడం చూచి, తన కొట్టులో ఉన్న, పిండీ, పప్పూ మొదలైన అన్ని వస్తువులూ ఇచ్చి వేశారు. గడవని రోజులు రాగా తాము గూడా తమ అన్నగారి వద్దకు ఆర్వీకి చేరుకొని నివాసం ఏర్పరచు కొన్నారు.

ఇద్దరన్నదమ్ములలో పంపకాల మాట వచ్చేసరికి అన్నగారు మంచి ఆసాముల్ని తమవైపు లాక్కోవడానికి ప్రయత్నించారు. దీన్ని వ్యతిరేకించి నప్పుడు ఆయనిలా అన్నారు – "ఇక్కడికి నేనే ముందొచ్చాను గదా! నేనే ఎక్కువ కష్టపడ్డాను, ఎక్కువ సంపాదించాను. నేనే ఎక్కువ నష్టపడాలేం?" అని. ఈ మాటవిని మూల్‌చంద్‌జీ హృదయం భక్తిపూరితమైంది. ఆయనన్నారు గదా – "ఇదంతా మీ సదాచరణ ఫలితమే. మీరే అంతా తీసుకొనండి. నాకేమీ వద్దు" అని ఏమీ తీసుకోకుండానే ఆయన వేరు పడ్డారు. దీని తర్వాత మూల్‌చంద్‌జీ రెవిన్యూ ఉద్యోగం సంపాదించుకొనిరి. అద్దె కొంపలో ఉంటూ జీవితం గడపడం ప్రారంభించారు. మన సాధు పుంగవులైన జాజూజీ తండ్రిగారు ఇలాంటివారు.

జాజూజీ వాళ్ళు నలుగు రన్నదమ్ములు. శ్రీ నథ్‌మల్‌జీ, భికించంద్‌జీ, శ్రీకృష్ణదాస్‌జీ, మధురదాస్‌జీ. శ్రీ మధురదాస్‌జీ చిన్నప్పుడే స్వర్గస్థులైనారు. వీరి తండ్రిగారు గూడా వీరి నాలుగో ఏటనే పరమపదించారు. కుటుంబ పోషణా భారమంతా ఇద్దరు జ్యేష్ఠ సోదరుల మీదే పడింది. ఐతే శ్రీ భికించంద్‌జీ కూడా తన అన్నగారికి ఎక్కువ కాలం అండగా ఉండలేక పోయ్యారు. అన్నగారి చేతిలో భారమంతా పెట్టి ఆయనొంటిగా వదలి ఈ లోకాన్ని వదలి వెళ్లిపోయారు. ఈ విధంగా కుటుంబములో ఈ ఇద్దరన్నదమ్ములే మిగిలారు. శ్రీ జాజూజీకి చదువు చెప్పించుట మొదలైన పనులను అన్నగారైన శ్రీ నథ్‌మల్‌జీ అత్యంత స్నేహంతోనూ, సమతా పూర్వకముగానూ నిర్వహించారు. శ్రీకృష్ణదాస్ బా.గా చదువు కోవాలనీ, వకాలత్ ప్యాసుచేసి బారిష్టరు కావాలనీ ఆయన కోరుకునే వారు. జాజూజీ వకాలత్ ప్యాసై తన అన్నగారి కోరికల్ని తీర్చారు.

## తల్లిప్రేమ

జాజూజీ జీవితంలో, ప్రతిరంగంలోనూ ప్రేమ స్వరూపిణియైన ఆయన తల్లిగారి ప్రభావం ఉండేది. అన్నగారు కుంచెలు అందజేయగా, తల్లిగారు తెలివైన చిత్రకారిణిలాగా సంస్కారాలు అనే రంగుల్ని జాజూజీ జీవిత విధానంలో దిద్దారు. సౌందర్యంలోనూ, స్వభావం లోనూ జాజూజీది అచ్చం తల్లి పోలిక. ఆమె కాయన మీద ప్రగాఢ మైన ప్రేమ. ఆమె ఎంత కష్టపడైనాసరే జాజూజీకి అన్ని సౌకర్యాలూ సమకూర్చేది. స్వయంగా అన్నం తినిపించేది. ఆయన తమ ఇంట్లో పైగదిలో కూర్చుని చదువుకుంటున్నా వీధిలో ఎవర్నీ అల్లరి చేయ నిచ్చేది కాదు.

'మా బుచ్చి పాపడు చదువుకుంటున్నాడు' అని ఆమె అందరికీ చెప్పేది. అందుకని అందరూ మౌనంగా ఉండేవారు. జాజూజీ పట్ల

తల్లికి చాలా ఆశలుండేవి. ఆమె సాధారణంగా "నా శ్రీకృష్ణుడు తండ్రి తాతల కీర్తిని అమరం చేస్తాడు" అని అంటుండేది. జాజూజీ తల్లిగారి ఈ ఆశీర్వచనాన్ని సార్థకం చేశారు.

జాజూజీకి కూడ తల్లిగారంటే బహుశ్రద్ధ. తల్లిగారి ఆజ్ఞను ఆయనెప్పుడూ తృణీకరించలేదు. ఆయన చిన్నప్పటినుంచే తల్లి మనస్సును నొప్పించడం పాపమనీ, ఆమె ఆజ్ఞను పాలించడం పుణ్యమనీ అనుకుంటుండేవాడు. ఈ కారణంవల్లనే ఆయన బాల్యావస్థనుంచే నిరాడంబరమైన, కర్తవ్య పూరితమైన జీవితానికి అలవాటు పడ్డాడు. తల్లితో ప్రేమపూర్వకంగా నైనా, చిన్నప్పుడు ఎప్పుడూ అబద్ధం ఆడియెరుగడు. ఎప్పుడూ స్పష్టంగా సత్యాన్నే చెప్పేవాడు. అందుకే కుటుంబంలో ఈయనంటే చాలా గౌరవం.

## శిక్షణ

చిన్నప్పటినుంచే జాజూజీది కుశాగ్రబుద్ధి. వీరి విద్యార్థి జీవితం అత్యంత గౌరవపూరితమైంది. వీరి బుద్ధిబలాన్ని శిక్షణ కాలంనుంచే, వీరి కుటుంబం, సహాధ్యాయులు, అధ్యాపకులూ గుర్తించారు. వీరు 1902, 1904 లలో క్రమంగా బి. ఏ., బి. ఎల్ పరీక్షలు కలకత్తా యూనివర్శిటీనుండి ప్రప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. కలకత్తా విశ్వవిద్యాలయం వీరిని 'స్వర్ణపతకం'తో గౌరవించింది. జాజూజీ ప్రాథమిక విద్యనుంచి, హైస్కూలు కాలేజీ విద్యల్లోనూ ఎల్లప్పుడూ ప్రథమ స్థానంలోనే ఉండేవాడు. ఉత్సవాలూ, సభలూ అయి, బహుమాన ప్రదానం జరుగుతుందంటే చాలు, ఆయన సహాధ్యాయులు, శ్రీ ఆత్రే, శ్రీ పాండే మొదలగువారు (వీరు ఇప్పుడు వార్ధాలో ప్రముఖ లాయర్లు), వీరి అధ్యాపకులుకూడా ముందే అనేవారు: "ప్రథమ బహుమానం జాజూది. మిగతావి అటూ ఇటూ" అని—

మిడిల్ వరకు జాజూజీ విద్యాభ్యాసం ఆర్వీలోనే జరిగింది. 1898లో నీల్ సిటీ హైస్కూలు నాగపూరునుండి మెట్రిక్యులేషన్‌లో మొదటి తరగతిలో ఉత్తీర్ణులయ్యారు. మారిస్ కాలేజీ, నాగపూర్ లోనే బి. ఏ., బి. ఎల్., వరకు వీరి విద్యాభ్యాసం జరిగింది. క్లాసులో జాజూజీ అటెండెన్సు నూటికి నూరుండేది. వీరి అటెండెన్సుని చూస్తే అధ్యాపకులకే ఆశ్చర్యం కలిగేది. ఇంట్లోకూడా వీరు ఎల్లప్పుడూ చదువుతూనో, రాస్తూనో ఉండేవారు. సంస్కృతం, నీతిశాస్త్రం వీరి అభిమాన విషయాలు. ధార్మిక పౌరాణిక విషయాలు చదవటంలోకూడా మొదటినుంచీ అభిరుచిని కనబరచే వారు. కోర్సు పుస్తకాలే కాకుండా సాధారణ విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు చదువుటలో అత్యంత అభిరుచిని ప్రదర్శించే వారు. ఈ విషయంలో వీరి అభిరుచి ఎంత బాగా ఉండేదంటే, అప్పుడప్పుడూ వీరు చదువని కొత్త పుస్తకమంటూ స్కూల్ లైబ్రరీలో ఉండేది కాదు. అధ్యయనంలో వీరికున్న ఈ తీవ్రోత్కంఠను చూచి, అన్న గారైన నథ్మల్‌జీకి ఒక గ్రంథాలయాన్ని తెరవాలనే కుతూహలం కలిగింది. ఆర్వీలో ఆయనొక పబ్లిక్ గ్రంథాలయాన్ని స్థాపించారు. నేటికి అది జాజూజీ విద్యాప్రేమను వేనోళ్ళ చాటుతూవుంది. ఆర్వీలో ఇప్పుడీ గ్రంథాలయం ప్రజాఉద్యమాలకు ప్రముఖ కేంద్రంగా ఉండి "లోకమాన్య సార్వజనిక వాచనాలయ్" అనే పేరుతో ప్రజాసేవ చేస్తూంది.

## గృహస్థాశ్రమ స్వీకారం

1902లో దాదాపు 18ఏళ్ళ వయస్సులో ఆర్వీ తహసీలులో 'నారా' అనే పల్లెటూర్లో ఉంటూన్న ప్రసిద్ధమైన పోకారణ మహేశ్వరీ కుటుంబంలోని, శ్రీ సేఠ్ గోరధన్‌దాస్‌జీ టావరీగారి ఏకైక పుత్రిక కస్తూరీబాయితో అతి నిరాడంబరంగా జాజూజీ వివాహం జరిగింది.

# 10

## న్యాయవాద వృత్తి

తమ శిక్షణ పూర్తయిన తర్వాత జాజూజీ, 1905లో వర్ధాలో న్యాయవాదవృత్తి ప్రారంభించారు. మార్వాడీల సమాజంలో న్యాయవాదవృత్తి ఆ కాలంలో గొప్పగా పరిగణించబడేది. అందుకని సహజంగా జాజూజీ తమ సమాజంలో గొప్ప వ్యక్తి అనుపించుకోసాగారు. 1905నుంచి 1920 వరకు వీరు చాలా సమర్థవంతంగా తమ న్యాయవాద వృత్తిని నిర్వహించారు. తమ విచక్షణా జ్ఞానం, తర్కశక్తిమూలంగా అత్యల్పకాలంలోనే గొప్ప లాయరుగా పేరు తెచ్చుకొన్నారు. జాజూజీ అబద్ధాల కేసుల్ని ఎప్పుడూ తీసుకోరనే ప్రఖ్యాతి ఉండేది. న్యాయాధీశుల హృదయాల్లో వీరి సత్యనిష్ఠ ముద్ర స్థిరంగా పడిపోయింది. జాజూజీ వాదించిన కేసులో తప్పకుండా జయం కలిగేది. అయితే ఈ కార్యాన్ని ఆయన వృత్తిగా స్వీకరించలేదు. దీని ద్వారా డబ్బు సంపాదించాలనే ధ్యేయం వారికి లేకుండెను. ఎంత పెద్ద కేసైనా సరే, అబద్ధపు కేసని తెలియగానే డబ్బుకు లోభించకుండా దాన్ని వదలుకొనుటతోపాటు, తన క్లయింట్సుకు దాన్ని వదలుకొమ్మని నిర్భయంగా చెప్పేవారు. ధనోపార్జనా దృష్టి అసలే లేనందువల్ల వారు సాధారణంగా కోర్టులలో పరస్పరం సంధి చేయించేవారు. వీరి ఈ సౌజన్యం సర్వత్రా కీర్తించబడేది. వీరి శాసన జ్ఞానం చాలా సూక్ష్మమైంది. ప్రతి కేసులోనూ దాని లోతుకు వెళ్ళి, దాని సత్యాసత్యాన్ని బాగా పరిశీలించిన మీదటనే దాన్ని వాదించేవారు. అయినా వీరికి న్యాయవాదవృత్తిలో అభిరుచి లేకుండెను. ఈ అభిప్రాయాన్ని వీరు చాలాసార్లు తమ మిత్రుల సమక్షంలో చెప్పారు. వీరి ఈ సౌజన్యం, సత్యనిష్ఠ, న్యాయశాస్త్రపరిజ్ఞానం వల్లనే స్వర్గీయ శ్రీ జమునాలాల్‌జీ బజాజ్‌గారు ముగ్ధులై వీరి వైపు ఆకర్షింపబడ్డారు.

న్యాయవాద వృత్తిమీద విరక్తి జాజూజీ మనస్సులో క్రాను క్రాను పెరుగుతూ పోయింది. న్యాయవాద వృత్తిలో నీతికీ, సత్య నిష్ఠకూ స్థానం లేదని ఆయన గ్రహించారు. సత్యమైన విషయాల్ని సత్యాలుగా రుజువు చేయడానికే అనేకమైన చిక్కులు పడవలసి వస్తుంది. ఈ విధంగా జాజూజీ ఆలోచిస్తూనే ఉండగా 1920 లో నాగపూర్ కాంగ్రెసు నిర్ణయాన్ని అనుసరించి, దేశం మొత్తంమీద సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం కావడ మేమిటి, కాంగ్రెసు వారు న్యాయవాదుల్ని తమ న్యాయవాద వృత్తినీ, విద్యార్థుల్నీ, అధ్యాపకుల్ని కాలేజీలనూ, స్కూళ్లనూ వదలి, జాతీయ పోరాటంలో పాల్గొన వలసిందిగా పిలుపు నివ్వడమేమిటి, ఈ ఆహ్వానాన్నందు కొని జాజూజీ న్యాయవాద వృత్తిని వదలడ మేమిటి అన్నీ ఒకదాని వెంట ఒకటి చరచరా జరిగిపోయాయి. అప్పట్నుంచే ఆయన నిరా డంబరంగా జీవించడానికీ, తన జీవితాన్ని దేశ సేవకూ, జాతి సేవకూ వినియోగించడానికి సంకల్పించు కున్నారు. ఈ నియమాన్ని వారు తాము మరణించేదాకా అతి కఠోరంగా పాటించారు.

## నిరాడంబర - మితవ్యయ జీవితం

మొదటినుంచే జాజూజీ నిరాడంబర ప్రియులు. విద్యార్థి జీవి తంలో కూడా ఆయ నెప్పుడూ సూటు ధరించలేదు. ఆయన న్యాయ వాదవృత్తి అత్యంత ఉన్నత దశలో ఉన్న రోజుల్లో కూడా ఆయన విదేశ పద్ధతి వస్త్రాల్ని ధరించలేదు. తన తలపాగాకు ఖర్చెక్కువైనా స్వదేశీ రంగుతోనే అద్దించుకునేవారు. ఖర్చులో కూడా వారు చాలా మితంగా ఖర్చుపెట్టేవారు. ప్రజాద్రవ్యాన్ని వ్యర్థంగా ఖర్చుపెట్టటం భయంకరాపరాధంగా వారు తలచేవారు.

వృత్తి వదలుకోక ముందు కొన్ని రోజులక్రితం జయపూర్ ఆస్పత్రిలో వీరికి ఆపరేషన్ చేసినప్పుడు, వీరికి 'డీలక్సు' అనే ప్రత్యేక

తరగతి ప్రత్యేకింపబడియుండెను. అప్పుడు వీరు తనను, సామాన్య తరగతి ప్రజలుండే తరగతికి మార్చమని కోరారు. "నేను దరిద్ర నారాయణుని ఉపాసకుణ్ణి. ఇది సేవకుల్ని ఉంచే స్థలంకాదు" అన్నా రాయన. మితవ్యయానికీ, నిరాడంబరతకూ ఈ అద్వితీయ ఉదాహరణ, ప్రజాకార్యకర్తలకు ఎల్లప్పుడూ ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉంటుంది.

## సంఘసేవ

న్యాయవాద వృత్తివల్ల జాజూజీకి చాలామందితో పరిచయం ఏర్పడ్డది. వీరికి గొప్పగొప్ప వ్యక్తుల సహవాసం లభించింది. వీరిలో స్వర్గీయ శ్రీ జమునాలాల్‌జీ బజాజ్ ప్రముఖులు. వీరే జాజూజీకి సంఘసేవ పట్ల ఉత్సాహాన్ని కలిగించి వారిని ప్రజారంగంలోనికి దించారు. ఇద్దరూ కలసి తమ కాలంలోని ఎక్కువ భాగాన్ని సంఘ సేవకు అర్పించారు. శ్రీ బజాజ్ సహాయంతోనే వీరు 1910 లో మార్వాడీ విద్యార్థి వసతి గృహాన్ని స్థాపించారు. 1912 లో మార్వాడీ హైస్కూలు స్థాపించారు. ఇదే క్రమంగా వృద్ధిచెంది, మార్వాడీ శిక్షామండలి రూపంలో పరిణతి చెందింది. దీని అధ్వర్యంలోనే నేడు మధ్యప్రదేశ్‌లోని మూడు కామర్స్ కళాశాలలు నిర్వహింపబడు తున్నాయి. మహిళలకూ, బాలురకూ శిక్షణ గరపటం కోసం, వార్ధాలో మహిళాశ్రమాన్ని స్థాపించటంలో వీరు ప్రముఖ పాత్ర వహించారు.

సంఘ సంస్కరణ పనుల్లో కూడా వీరికి చాలా అభిరుచి ఉండేది. మార్వాడీ విద్యార్థి వసతి గృహంద్వారా వీరు కులభేదాన్ని రూపు మాపటానికి ప్రయత్నించారు. సంఘసంస్కరణోద్యమంలో వీరిక్రింద తరిఫీదు పొందిన మహేశ్వరీ వంశ యువకులు, క్రమంగా ప్రజా రంగంలో ప్రవేశించి జాతీయపోరాటంలో పాల్గొన్నారు. మహేశ్వరీ సమాజంలోని పరదా విధానం, మృత్యుభోజనాలు, బాల్యవివాహాలు,

పంచాయితీ దండుగలు మొదలగు దురాచారాల్ని బాగా వ్యతిరేకించ డంతో పాటు, అంతర్వర్ణ వివాహాల్ని ప్రోత్సహించేవారు. వీరు తన కుమార్తె అనసూయను, శ్రీ రాధాకృష్ణబజాజ్ (అగ్రవాల్ కుటుంబం) కిచ్చి, పెళ్లిచేసి, అంతర్వర్ణ వివాహాలను ఆచరణ పూర్వకంగా చేసి చూపించారు.

1922 లో జాజూజీ అఖిల భారత మహేశ్వరీ సభ, కలకత్తా సమావేశానికి అధ్యక్షులుగా ఎన్నుకో బడ్డారు. వీరి ప్రభావం చేతే మహేశ్వరీసభా కార్యక్రమాలకు ప్రాణం వచ్చింది. 1924 లో కోల్డువార్ ప్రకరణంమీద రేగిన సంఘర్షణమూ, దాని ఫలితంగా పర్పడిన పరస్పర వైమనస్యాల్ని, అతికుశలతతో అంతమొందించడమే కాక ప్రతిక్రియావాదుల ప్రయత్నాల్ని కూడా విఫలం చేశారు.

## జాతి సేవావ్రతము

1920 తర్వాత జాజూజీ తమ జీవితాన్నంతా జాతిసేవకు అర్పితం చేశారు. న్యాయవాద వృత్తి వదలిన తర్వాత వారి జీవితమంతా ప్రజాసేవలోనే గడచిపోసాగింది. క్రమంగా వీరికి కాంగ్రెసు వారి కార్యక్రమాలు రుచించ సాగాయి. లోకమాన్య తిలక్ గారి ఆలోచనల ప్రభావం జాజూజీ మీద బాగా పడింది. తిలక్ మహాశయుని అనంతరం జాతీయ జీవనంలో గాంధీజీ ప్రవేశించినతర్వాత జాజూజీ గాంధీజీ సిద్ధాంతములవైపు ఆకర్షింపబడి వారి కార్యక్రమాల్లో పాల్గొన ప్రారంభించారు. వీరు ఉప్పు సత్యాగ్రహం, అటవీ సత్యాగ్రహం, క్విట్ఇండియా ఉద్యమం మొదలగు అనేక ఉద్యమాల్లో పని చేశారు. ఎన్నోసార్లు జైలుకు వెళ్లి అనేక విధాల యాతనల్ని అనుభవించారు. విదేశాధికారానికి వ్యతిరేకంగా వారి మనస్సు తీవ్రంగా ఆరాటపడేది. అందుకనే 1942 క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో, నిర్మాణ కార్యక్రమాల్లో మునిగి ఉన్నప్పటికీ ఆయన మనస్సు ఆ ఉద్యమం

నైనే పే మొగ్గించి. ఈ పనుల్లో ఆ రోజుల్లో ఆయనకు శ్రద్ధ ఉండేది కాదు. పోలీసులాయన్ని అరెస్టుచేసి తీసుక పోతున్నప్పుడే ఆయన ముఖం ప్రసన్నంగా అగుపించింది.

## ఖాదీ జగత్తుకు సేవ

స్వర్గీయ శ్రీ జమునాలాల్ జీ హృదయంలో జాజూజీ వ్యవహార సరళి, కార్యదీక్ష, అనుభవజ్ఞతతో పాటు ఆయన నీతియుతమైన ఆచ రణ ప్రభావం బాగాపడింది. అందుకే జమునాలాల్ గారు 1927 లో జాజూజీకి మహారాష్ట్రి చరఖాసంఘ కార్యాన్ని అప్పగించారు. జాజూజీ ఈ సంఘప్రణాళికలోనూ, కార్యక్రమాల్లోనూ, వాటి నిర్మాణం లోనూ తన ప్రతిభను ప్రదర్శించుతూ, తమ బాధ్యతలను యోగ్యతతో నిర్వర్తించారు. 1927 నుంచి 1928 వరకు వీరు దీని కార్యదర్శిగా ఉన్నారు. దేశం మొత్తానికి జాజూజీ ఖాదీ సేవకుడుగానే తెలుసు. ఖాదీ కార్యక్రమానికి వీరు ఏకనిష్ఠతోనూ, అనన్యమనస్కతతోను సేవ చేశారు. ఖాదీ ఉద్యమం నేడు ఇంత వైజ్ఞానికంగా పెంపొందటానికి వీరి అమూల్యమైనట్టిన్నీ, ప్రజాహితమైనట్టిన్నీ కృషే కారణం. ఈ ఉద్యమంలో వ్యాపార దృష్టికికాకుండా సత్యవర్తనకే ప్రథాన స్థానం ఉండాలని జాజూజీ నిరంతరం ప్రయత్నిస్తూండేవారు. వీరు ఖాదీకార్య క్రమాన్ని గాంధీజీ ఆదర్శాలకు సమన్వయించారు. ఖాదీ సిద్ధాంతాన్ని బాగా లోతుకు వెళ్లి అధ్యయనంచేసి వీరు దీనికి వైజ్ఞానిక స్థాయిని కల్పించడమే కాక, ఖాదీ కార్యక్రమంతో సంబంధమున్న ప్రతి ఖాదీ కార్మికుని జీవితంలో గౌరవ ప్రమాణాలను నిశ్చయించారు. ఇక్కడొక విషయాన్ని బాగా గమనించ వలసియుంది. నిర్మాణాత్మక సంస్థల్లో జీతాలు తీసుకొని, జీతాలు లేకుండా పని చేసే కార్యకర్తల విష యంలో ఉత్పన్నమయ్యే సమస్యల ప్రభావం వీరి మీద బాగా పడి, జీతం తీసుకొని పనిచేసే కార్యకర్తల ప్రతిష్ఠ కోసం, వారిలో తాము

తక్కువవారు అనే భావం రాకుండా ఉండటానికి స్వయంగా చరఖా సంఘం నుండి రూ. 30 ల నెల జీతం, నిర్వాహక వేతన రూపంలో పొందుతుండే వారు. ఖాదీ కార్యక్రమాల వెనుక ఉన్న సిద్ధాంతాలకు శాస్త్రరూపమిచ్చి, నిత్యజీవితంతో వాటికి సంబంధం కల్పించారు. వీరు పెట్టిన ఈ భిక్ష నేటికీ ఖాదీ జగత్తుకు మార్గదర్శకంగా ఉన్నది. వీరు సిద్ధపరచిన చరఖా సంఘ చరిత్ర అమర కృతిగా ఎల్లప్పుడూ ప్రసిద్ధమై ఉంటుంది. ఖాదీ జగత్తుకు ఇది వారి అమూల్యమైన అర్పణ. ఖాదీ కార్యక్రమాల ప్రోత్సాహకులుగా, నిపుణ మార్గ దర్శకులుగా వారి పేరు చిరకాలం ఉంటుంది.

## బాపూజీతో పరిచయం

మహారాష్ట్ర చరఖాసంఘ సేవ మూలంగానే మహాత్మా గాంధీతో వీరి పరిచయం క్రమంగా దృఢపడ సాగింది. వీరి సత్యనిష్ఠ, కార్య కుశలత, నిర్భయత్వంతో బాటు సరళ ప్రవృత్తి, సాత్విక భావాలు బాపూజీకి బాగా నచ్చినవి. క్రమంగా జాజూజీకి గాంధీజీ హృదయంలో అనన్య సాధ్యమైన స్థానం లభించింది. గాంధీజీ వీరిని 'వాచ్ డాగ్' అంటుండేవారు. గాంధీజీకి వీరి మీద ఎంత విశ్వాస మంటే —చాలాసార్లు గాంధీజీ "ఫలానా విషయాన్ని జాజూజీని అడిగి తెలుసుకొన్న తర్వాత నన్నింక అడగనక్కరలేదు" అనేవారు. పూజ్య బాపూజీ జాజూజీ కారణంగానే వ్యవస్థావిషయాల్లో నిశ్చింతగా ఉండే వారు. వార్ధాలోని కార్యక్రమాల నిర్వహణలోనూ, వికాస కార్య క్రమాల్లోనూ జాజూజీ గాంధీజీకి ముఖ్య సలహాదారుగా ఉండేవారు. గాంధీజీ మనస్సులో జాజూజీని గురించి, ప్రేమా గౌరవం ఉండేవి. బాపూజీ ఆయన పరిపక్వ బుద్ధిని ప్రశంసించే వారు.

చరఖా సంఘమే కాక అనేక అఖిలభారత నిర్మాణకార్య సంస్థలకు, కార్యక్రమాలకు జాజూజీ సలహాదారుగా, ట్రస్టీగా, కార్య

వర్గ సభ్యులుగానూ ఉండేవారు. అఖిల భారత గ్రామోద్యోగ సంఘం సర్వసేవా సంఘం, గాంధీ స్మారకనిధి, కస్తూర్బా స్మారక ట్రస్టు, గాంధీ సేవా సంఘం, అఖిల భారత ఖాదీ గ్రామోద్యోగ బోర్డు మొదలగు సంస్థల్లో ఏదో ఒక విధంగా సభ్యులుగానూ, మార్గ దర్శ కులు గానూ ఉండేవారు. డిసెంబరు 1934 లో స్థాపింపబడ్డ ఖాదీ గ్రామోద్యోగ సంఘానికి మొదట్లో ఒక సంవత్సరం పాటు అధ్య క్షులుగాను, 1947 వరకూ కోశాధిపతిగానూ ఉండిరి. గాంధీ సేవా సంఘం, గాంధీ సిద్ధాంతములయందు విశ్వాసంగల పురాతన కార్య కర్తల ప్రముఖమైన ప్రతినిధి సంస్థగా ఉండెను. అందులో గూడా వీరు ప్రముఖులే. ఈ విధంగా గాంధీసిద్ధాంతాల ప్రకారం స్థాపితమైన అఖిల భారత స్థాయిలోగల అన్ని సంస్థలలోనూ వీరు క్రియాశీల సభ్యులుగా ఉండిరి. 1948లో వినోబాజీతో పాటు శరణార్థుల సేవలో కూడా సహకరించారు.

## త్యాగానికి ప్రత్యక్షోదాహరణ

జాజూజీ జీవితం త్యాగముతోనూ, సేవతోనూ కూడుకున్న ట్టిది. అయితే కీర్తికాంక్ష గానీ పదవీ వ్యామోహం గానీ ఎంత మాత్రమూ వారి దరిదాపుకు చేరలేకుండెను. వారి త్యాగాన్ని, స్వార్థరాహిత్యాన్ని ద్విగుణీకృతం చేసే సంఘటనలు వారి జీవితంలో అనేకం ఉన్నాయి. 1937లో మధ్యప్రదేశ్ లో డా. ఖరే - సమస్యమీద కాంగ్రెసు ప్రభుత్వానికి అవరోధం కలిగింది. అప్పుడు కాంగ్రెసు ప్రతిష్ఠను కాపాడటానికి, కాంగ్రెసు హైకమాండులో ప్రధాన కార్యదర్శి పదవి కోసం, ఇలాంటి యోగ్యుడూ, దేశభక్తుడూ, ఇరు పక్షాలవారికీ అనుకూలుడూ అయిన వ్యక్తి అవసరమైనాడు. అప్పుడు కాంగ్రెసు కార్యవర్గ సమావేశం వర్ధాలో జరిగింది. అందరి దృష్టి జాజూజీ మీద పడింది. ఈ కార్యానికి జాజూజీని ఒప్పించే

బాధ్యత బాపూజీ స్వయంగా తన మీదే వేసుకున్నారు. పూజ్య గాంధీజీ, కిశోరీలాల్ భాయి, జమునాలాల్ జీ — జాజూజీకి పరిస్థితు లన్నింటినీ వివరించి, ప్రధాన కార్యదర్శి పదవిని నిర్వహించ వలసిందిగా జాజూజీని కోరారు. అదే మొదటిసారి, వారు బాపూజీ కోరికను గూడా గట్టిగా, అయితే సరళంగానే నిరాకరించారు. వీరి అనాసక్త హృదయాన్ని పూజ్యబాపూజీ కోరిక కూడా కదలించ లేక పోయింది. పూజ్యబాపూజీ కోరికనే నిరాకరించారే, అని ఆయ న్నడిగినప్పుడు, వారు అత్యంత సరళంగా ఈ విధంగా ప్రత్యుత్తర మిచ్చారు. "అధికారంలో అసత్యానికీ, అన్యాయానికి ఒడికట్ట వలసి వస్తుంది. నా హృదయం దీన్ని ఒప్పుకోడానికి సిద్ధంగాలేదు."

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రథమ జాతీయ ప్రభు త్వంలో ఆర్థికమంత్రి పదవికి, స్వయంగా బాపూజీయే జాజూజీపేరును సూచించారు. బాపూజీని ఆయన తన గురువుగా, నాయకుడుగా, పెద్దమనిషిగా గౌరవిస్తూన్నప్పటికీ, ఈ రెండు సందర్భాల్లో మాత్రం ఆయన బాపూజీ కోరికనుకూడా వినయపూర్వకంగా నిరాకరించి నిర్మాణ కార్యక్రమాల్లో నిస్స్వార్థ, నిష్కామ ప్రవృత్తికి అద్వితీయోదా హరణంగా నిలిచారు.

## సర్వోదయ సిద్ధాంత ప్రచారం

పూజ్య బాపూజీ నిర్యాణానంతరం శ్రీ జాజూజీ సర్వోదయ సిద్ధాంతాల ప్రచారానికీ, వాటి ప్రాచుర్యానికీ దేశమంతా తిరిగారు. ప్రతిచోటా వడకుసంఘాల్ని నెలకొల్పారు. వీటిద్వారా వస్త్ర స్వావలం బనకు ప్రోత్సాహం కలిగించారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కార్య కర్తలు, చరఖా ప్రాముఖ్యాన్ని, వడకుట ప్రాముఖ్యాన్ని క్రమంగా మరువజొచ్చినారు. అట్టి సమయంలో కార్యకర్తల దృష్టిని వీరు చరఖా, ఖాదీ ఉద్యమాలమీద కేంద్రీకరింపచేశారు. ఆ సమయంలోనే

వకు సంఘాల నిర్మాణంలో సంచలనం బయలుదేరి, గాంధీ సిద్ధాంతాల్ని నమ్మే కార్యకర్తలు సంఘటితమగుటకు ఒక ఆధారం లభించింది. దేశం మొత్తంమీద ప్రతిచోటా, సభల్లోనూ, శిబిరాల్లోనూ— నిరాశా నిస్పృహలలో కింకర్తవ్యతా విమూఢులై ఉన్న కార్యకర్తల్ని సమావేశపరచి, మార్గదర్శకులు అగుటయే కాకుండా వారు కార్యక్రమాల్లో తమకున్న దీక్షను దృఢపరచారు. ఈ సమయంలోనే వీరు సర్వోదయ సమాజ నిర్మాణపు సూత్రాల్ని స్పష్టంగా కార్యకర్తల ముందుంచారు.

## భూదానానికి జీవితార్పణం

1951లో పూజ్య వినోబాజీ, భూదానోద్యమం ప్రారంభించినప్పటినుంచీ జాజూజీ, ఈ నైతికోద్యమపు వికాసానికి తన జీవిత సర్వస్వాన్నీ అర్పించారు. భూదానోద్యమానికి తన బుద్ధినీ, హృదయాన్నీ, ఆలోచననూ వినియోగించారు. 73 పళ్ళ వయస్సులో ఉండి కూడా, చలి, ఎండా మొదలగువాటిని లెక్కగొనకుండా విభిన్న ప్రదేశాలలో యాత్రలు చేశారు. ధారాపాతమైన వర్షాలుకూడా పురోగమిస్తున్న ఆయన అడుగుల్ని ఆపలేక పోయాయి. ఆ రోజుల్లో వీరు ఒక నిమిషం కూర్చోవటంకూడా అరుదుగా జరిగేది. ఒక విచిత్రమైన ఉత్సాహం, ఆవేశం ఈ ఉద్యమంపట్ల వీరి కుండేది. తన శరీరాన్ని ఎంతగా ఉపయోగించగలిగితే అంతగా ఈ ఉద్యమానికే వారు ఉపయోగించాలనుకునేవారు.

శాసనవృష్టితో, భూదాన చట్టము ననుసరించి నిర్మింపబడే భూదానబోర్డు నిర్మాణంలో వీరి సహకారం చాలా ఉపయుక్తంగా ఉండేది. మధ్యప్రదేశ్ భూదానబోర్డు అధ్యక్షులుగా ఉండి భూదాన యజ్ఞశాసనాన్ని తయారుచేయుటలో వీరు ప్రముఖపాత్ర వహించారు. ఈ విధంగా దేశంలో ఎక్కడెక్కడ భూదానచట్టం అమల్లోకి

వచ్చిందో అక్కడక్కడ వీరి న్యాయశాస్త్రపరిజ్ఞానంవల్ల దేశం లాభ పడ్డది. దీన్ని వీలైనంత వరకు ఉద్యమానికి అనుకూలంగా చేయుటకే వీరు ప్రయత్నించారు.

## సంపత్తిదాన ప్రణేత

సంపత్తిదాన ఉద్యమానికి ఆయనే ప్రణేత. ఈ ఉద్యమం ప్రారంభమైనప్పటినుంచీ వారి ఆలోచనలేమీ, రచనలేమి దీని మీదే కేంద్రీకరింపబడ్డాయి. దీన్ని గురించి వారు స్వతంత్రంగా ఆలోచించే వారు; ఎన్నో మౌలిక తీర్మానాల్ని ఈ విషయంలో వారు ప్రవేశ పెట్టారు. సంపత్తిదానానికి ఒక శాస్త్రాన్నే వారు సృష్టించారు. వారి ఆలోచనలు పరిణతి చెందిన కొద్దీ సంపత్తిదానపు విధానాలూ, దాని వినియోగం గురించి ఆచరణసంబంధమైన మార్పుల్ని అందులో చేస్తూ పోయారు. బొంబాయిలోని ధనికులకు జాజూజీ సంపత్తిదానోద్యమ శాస్త్రాన్ని స్పష్టంగా వివరించారు. శ్రీ జాజూజీ, శ్రీ జయప్రకాశ బాబూ ఇద్దరూ కలసి, బొంబాయిలో సంపత్తి దానోద్యమానికి పునాదులు వేశారు. సంపత్తిదాన కార్యక్రమాల్లో నిమగ్నులై ఉన్నప్పుడు శారీరక అస్వస్థతవల్ల వారికి ఆటంకం కలిగినప్పుడల్లా వారు చాలా బాధ పడేవారు.

భూదానోద్యమంలో తమ అధిక సమయాన్ని వినియోగించడం ప్రారంభించి నప్పటినుంచే, ఈ కార్యక్రమంలోనే తమ సంపూర్ణ శక్తిని వినియోగించాలని, క్రమక్రమంగా ఇతర సంస్థలన్నిటినుంచీ సంబంధాల్ని త్రెంచుకున్నారు. భూదానోద్యమం, సంపత్తిదానోద్యమం సందేశాల్ని దేశానికి అందించుటకు నిరంతరం పర్యటించడం ప్రారంభించి నప్పటినుండీ ఏకైక దీక్షతో దీని సేవే చేయడం ఉచితమను కొన్నారు. "వ్యభిచారిణీ భక్తి" ఆయన కిష్టం లేకుండెను. అందుకనే క్రమ క్రమంగా వారు ఇతర సంస్థల కార్యభారం నుంచీ, సభ్యత్వం

నుంచీ విముక్తులైనారు. గాంధీ స్మారకనిధి, కస్తూర్బా స్మారక ట్రస్ట్ మొదలైన సంస్థల ట్రస్టీషిప్పునుకూడా వారు వదలుకొన్నారు. భూదానోద్యమంలోనే తాము నిమగ్నులై దానిలోనే లీనమైపోయారు.

## ప్రవర్తనా సంస్కరణోద్యమం

యుద్ధం ముగిసిం తర్వాత, స్వాతంత్ర్యం వచ్చిం తర్వాత దేశంలో క్రమక్రమంగా నైతిక స్థాయిలో పతనం ఆరంభించింది. నాలుగు దిక్కులా బ్లాకుమార్కెట్టు, లంచగొండితనం, ధనదాహం మొదలైన భ్రష్టాచారాలు ప్రబలసాగాయి. 1951లో ఈ అవినీతి ప్రాబల్యానికి వ్యతిరేకంగా పూజ్య నాథ్‌జీ మహరాజ్‌గారు ప్రవర్తన సంస్కరణోద్యమాన్ని ప్రారంభించారు. "హరిజన్"పత్రికలో స్వర్గీయ శ్రీ కిషోరీలాల్ భాయి ఈ సమస్యను చాలా గట్టిగా చర్చించారు. శ్రీ నాథ్‌జీ మహరాజ్‌గారు జాజూజీని ఈ ఉద్యమంలో సహకరించవలసిందిగా ఆహ్వానించారు. ఈ ఉద్యమాన్ని జాజూజీ వర్ధాలో ప్రారంభించారు. ఈ ప్రవర్తన సంస్కరణను గురించి సూక్ష్మ పరిశోధన చేసికొని, వ్యావహారిక సమస్యలమీద 'వ్యవహార శుద్ధి' (ప్రవర్తన సంస్కరణ) అనే చిన్న పుస్తకాన్ని కూడా తయారుచేశారు. జాజూజీ ఈ ఉద్యమాన్ని వ్యాపింపచేయడానికి ప్రతిజ్ఞాపత్రాన్ని సిద్ధ పరిచారు. దేశంలోని వందల కొలది ప్రజానీకం— వర్తకులూ, వాడకందారులూ ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రతిజ్ఞా పత్రాన్ని నింపి వారు ప్రవర్తన సంస్కరణకు సంకల్పించుకొనిరి.

## మహాప్రస్థానం

నిర్విరామంగా పని చేస్తూ చేస్తూ వారి శరీరం క్షీణించి పోతూ వచ్చింది. ఒక్క క్షణం కూడా వ్యర్థంగా గడపటం ఆయనకు బాగుండక పొయ్యేది. చివర వరకు వారు దరిద్ర నారాయణుని

సేవలోనే సంలీనమైనారు. వృత్తి వదులుకొనుటకు 15 సంవత్సరాల పూర్వంనుంచే వారు. 'హెర్నియా' అనే రోగంతో బాధ పడుతూ ఉండేవారు. అయితే తమ నిగ్రహ జీవితంవల్ల దాన్ని వారు అదుపులో ఉంచుకో గలిగారు. కాని వృద్ధాప్యపు అశక్తత వల్ల ఆయన కుడివైపు 'హెర్నియా' ప్రారంభమైంది. వారు సమర్థులైన సర్జన్‌తో ఆపరేషన్ చేయించుకొని, ఈ వ్యథనుండి విముక్తులై భూదానోద్యమంలో తమ సంపూర్ణ దృష్టిని కేంద్రీకరించి పనిచేయాలనుకునేవారు. జయపూర్ (రాజస్థాన్) లోని డా. శర్మగారి సేవా భావంవల్ల వారు చాలా ప్రభావితులైనారు. అందుకని జయపూర్‌లోనే ఆపరేషన్ చేయించు కోవాలని ఆయన నిశ్చయించుకున్నారు. 13వ అక్టోబరు, 1955 నాడు జయపూర్‌లో వారి హెర్నియా ఆపరేషన్ ఫలవంతంగా చేయ బడింది. క్రమంగా వారి ఆరోగ్యం బాగుపడ నారంభించింది. కాని ఆయన ఆత్మ లోలోపలనే ఈ భౌతిక శరీరం నుండి ముక్తి పొందుటకు వ్యాకుల పడజొచ్చింది. 23వ అక్టోబరు నాడు రాత్రి ఒకటిన్నర గంటలకు హఠాత్తుగా గుండె దడ ఆరంభమైంది. వేడిహెచ్చింది. ఆయన పుత్రుడు నారాయణదాస్ జాజూ ఆయనకు మంచినీళ్లు త్రాగించారు. మంచినీళ్లు త్రాగంగానే ఆయన గుండె హఠాత్తుగా ఆగిపోయింది. ఆయన ప్రాణాలు ఈ నశ్వర శరీరాన్ని వదలి శాశ్వ తంగా ఎగిరి పోయాయి. రాజస్థానపు కర్మభూమి దరిద్రనారాయణుని సేవ కోసం ఈ పుత్రరత్నాన్ని కన్నది. ఒక సాహస వీరుని వలె, సేవా క్షేత్రంలో పాదుకొని ఉండి తుది దినాల్లోకూడా భూదానోద్యమం ద్వారా దరిద్ర నారాయణుల సేవ చేస్తూ, అవసాన దశలో ఈ ఉద్య మాన్నే తలపోస్తూ ప్రాణాలను ఒదిలారు. రాజస్థాన వీర భూమి ఈ వీర పుత్రుణ్ణి తనలో లీనం చేసుకున్నది. ఈ విధంగా జాజూజీ కర్మ యోగివలె పరమ శాంతంగా మృత్యువును ఆహ్వానించుకున్నారు.

---

# జాజూజీ పుణ్య సంస్మరణం

వి నో బా

కిశోరీలాల్ భాయి గతించినప్పుడు వారి కుటుంబానికి సందేశం పంపుతూ 'పరమేశ్వరుడు జర్జర దేహం నుండి వారిని విడిపించారు, అందుకని ఆయనకు మనం కృతజ్ఞులం కావాలి' అని నేనన్నాను. ఇప్పుడు, మూడు సంవత్సరాల తర్వాత, విశ్రాంతి తీసుకునే సంపూర్ణాధికారమున్న వ్యక్తి యొక్క అధికారాన్ని మళ్లీ పరమేశ్వరుడు గుర్తించారు. అందుకూడ ఆయనకు మనమంతా కృతజ్ఞులం. మన మానసిక స్థితి విలక్షణమైంది. ఈ విధంగా మన సహచరులు గతిస్తూంటే మనకు బలంవస్తూంది; వారు బ్రతికున్నప్పుడు ఎట్లాగూ మనం బలాన్ని పొందనే పొందుతాం. జాజూజీ గతించిన వార్త నేను విన్నప్పుడు కూడా నాకేమి ఇతరమైన ఆలోచన రాలేదు. పరమేశ్వరుని సూచన లభించిందంతే. "నీళ్లు చాలా జోరుగా ప్రవహిస్తున్నాయి. నువ్వు నీ పనిని అతి శీఘ్రంగా ముగించుకో; మరొకసారి ఆలోచించుకో; నువెవ్వరివి? నీ రూపేమిటి? ఏ పని కోసం నువ్విక్కడికి వచ్చావు? ఈ జన్మంలో నువ్వు సాధించ లేకపోతే, చాలా కోల్పోతావని మాత్రం గుర్తుంచుకో!" అని.

దీనిమీద, ఈ పనిలో మనం ఇంత తీవ్రతను ప్రదర్శించుటకు కారణాన్ని మీరు అర్థం చేసుకోగలుగుతారు. కూర్చున్న పళంగా నా శరీరము పడి పోవాలని నేను కోరను. ఈశ్వరేచ్ఛే తుదకు నెగ్గి తీరుతుందనుకొండి, మన కోరికలకు అసలు విలువ లేనేలేదు. అయినా ఈ శరీరం గమనంలో ఉండగానే పడిపోవాలని నా కోరిక.

## జాజూజీ - కిశోరిలాల్ భాయి

నాకు బాపూజీ వియోగం కలిగినట్లు క్షణమాత్రమైనా తోచదనే విషయం మీకు చెప్పదలచుకున్నాను. దీనికి ఈశ్వరుడే సాక్షి. బాపూజీ నిరంతరం మా వెంటే ఉన్నట్లు మా అనుభవాని కొస్తుంటుంది. వందల కొలది తప్పులు చేస్తుంటాం. కాని చిత్రమేమిటంటే ఆ తప్పు లకు పశ్చాత్తాపం కూడా కలగదు. ఈ లాంటి అసమర్థునితో పని తీసుకోవాలని కోరే వారికే ఇవీ అర్పితమౌతాయి. అంతా వాడి ఇచ్ఛ. అయినప్పటికీ ఎన్నో తప్పులు జరుగుతూనే ఉంటాయి. అయితే ఈ తప్పులన్నింటికీ బాధ్యత నా పైనే ఉందని ఎప్పుడూ అనిపించదు.

కిశోరిలాల్ భాయి, జాజూజీ ఇద్దరూ భూదానోద్యమంలో దైవకృప వల్ల ఒకరుగా కలిసిపోయారు. అయితే ఇప్పుడు తమ కార్యభార సర్వస్వాన్ని మీమీదా నామీదా మోపి వెళ్లి పోయారు.

## ఆయన్ని మనం గుర్తించలేదు

జాజూజీతో నా పరిచయం 1921 నుంచే ఉంది. నాకు మొదటినుంచీ ఒక విశ్వాసం ఉండేది. నేను శాస్త్రాల్ని అధ్యయనం చేయక ముందునుంచీ నాకా విశ్వాసం ఉండేది. శాస్త్రాధ్యయనం ఆ విశ్వాసాన్ని దృఢపరచింది. అదేమంటే ఉత్తమ పురుషుల జాడ ప్రపంచాని కెన్నడూ తెలియదు. ఒక వేళ ఆ జాడ తెలిసినా చాలా తక్కువ అని. ఈ ప్రపంచానికి తెలిసి, ఏ ఏ మహాపురుషులు మహా తేజస్సుతో వెలుగొందారో, ఆ మహా తేజస్సు, నిజంగా వారికున్న మహత్వమంత గొప్పది మాత్రం కాదు. ఈ మహా పురుషుల జాడ ప్రపంచానికి అసలే దొరకనైనాలేదు. దొరికినా చాలా తక్కువగా లభించింది. ఈ మహా పురుషుల స్థాయిలోనే, ఈ వరుసలోనే ఎక్కడో జాజూజీ స్థానం కూడా ఉందని నా కనిపిస్తూ ఉంటుంది. మనం వారిని

గుర్తించలేదు; అది మన పరమ దౌర్భాగ్యం. వారికి దుఃఖం కలిగిందని విన్నాను. వారి దుఃఖం వల్ల నా కన్నుల్లో నీరు నిండింది. వారిని వెన్నల గదిలో ఉంచారు. వారి దుఃఖాన్ని చూచి ఆ గదినుంచి వారిని తొలగించ వలసి వచ్చింది.

## "అనేకుల్లో ఒక్కరు"

వర్డ్స్‌వర్త్ మహాకవి; మనం స్మారకాల్ని ఎలా చేసుకోవాలో చెపుతూ ఒక 'కవిత' వ్రాశాడు. చనిపోయిన తర్వాత సాధారణంగా మనుష్యుల స్మారక చిహ్నా లేర్పడతాయి. అందుకనే ఈ విషయంలో ఆయన సలహా ఇచ్చారు. ఏమన్నారంటే "ఇది నా చిన్న పల్లెటూరు; ఇందులోనే నేను జన్మించాను. ఇక్కడే ఈ పరిసరాల్లో ఒక కొండ ఉన్నది. అక్కడికి పూర్వం నేను ఆడుకోడానికి పోయేవాణ్ణి. దాని మీద చాలా రాళ్ళు పడి ఉన్నాయి. శిల్పులు వానిలోని మంచి మంచి రాళ్ళను తమ పనికోసం తీసుకుపోతుంటారు. ఈ విధంగా ఎన్నో రాళ్లు అక్కడినుంచి కొనిపోబడ్డాయి. కాని ఒకే ఒకరాయి అక్కడ అలాగే పడిఉంది. ఏ శిల్పిగూడా దానివైపు ఆకర్షింపబడలేదు. ఆ రాయినే నా స్మారకంగా గుర్తించాలి". కవి ఇంకా ఏమంటాడంటే— "ఆ రాయి మీద 'అనేకుల్లో ఒక్కరు' అని వ్రాయాలి."

మహత్త్వాకాంక్ష అని మనం దేన్నంటున్నామో అది నేడు కూడా మనుష్యుల్లో ఉంది. మహత్త్వాకాంక్ష ఉండటమనేదే మహత్త్వ భావానికి లక్షణం.

## వేదాంతంలో తన్మయం

జాజూజీకి ఏలాంటి మహత్త్వాకాంక్ష లేకుండెను. ఒక ప్రత్యేక మైన సంకట సమయంలో ఆయన్ను ఒక రాష్ట్రి ముఖ్య మంత్రి పదవి నిర్వహించవలసినదిగా కోరటం జరిగిన సంగతి ప్రజానీకానికి

తెలుసు. దీని వల్ల సమస్య పరిష్కారమయ్యేది; కాంగ్రెసుకు సంకటా వస్థ తొలగేది. అందుకనే, ఇతరుల సంగతలా వుంచి, బాపూజీకూడా స్వయంగా కోరారు. అయినప్పటికీ జాజూజీ "నా స్థానం నాకు తెలుసు అది నా స్థానం కాదు" అని చెప్పేశారు.

జనకమహారాజువలె అనాసక్తులై ఉండికూడా గొప్ప అధి కారాన్ని చేతిలో ఉంచుకొని ప్రజానీకంలో పని చేయగలిగే మాన వుల్నిగూడా మనం ఊహించగలం; ఊహిస్తున్నాం. అలాంటి మాన వుల అవసరంకూడా ఉంది. అదొక స్థాయి. కాని జాజూజీ మనస్సు మరో విధంగా ఉండెను. ఆయన ఎల్లప్పుడూ వేదాంతంలో మునిగి తేలుతూ వుండేవారన్న విషయం చాలామందికి తెలియకపోయినా నాకు బాగా తెలుసు. "నే నెక్కడుంటే అక్కడే సేవ చేస్తాను. వీరు నా కుటుంబీకులు, 'వీరు కారు' అనే భేదభావమే నా కిప్పుడు స్ఫురిం చడం లేదు" అని ఆయన తన పిల్లలకు చెప్పారు. ఇది మామూలు మాటగానే కనబడవచ్చు; అయినా ఇదొక మహాభాగ్యం. పెద్ద పెద్ద భక్తులూ, మహాత్ములూ నిరంతరం దేనికోసం ఉవ్విళ్ళూరుతూవుంటారో అట్టి సౌభాగ్యమిది. ఆయన జీవితాంతం వరకూ ఎవరి సేవ చేస్తూ వచ్చారో, వారు, నేను ముందుగానే చెప్పినట్టు, ఆయన వైశిష్ట్యాన్ని గుర్తించలేక పోయారు. 'ఇక మన వంతు' అనినా సోదరి అంటూ వుంటుంది. అందుకని మనం మన పనిని తీవ్రతరం చేయాలి.

సంపత్తి అంటే ఏమిటి ? నాసిక్‌లో అచ్చయ్యే కాగితం ముక్కలు. ఇదంతా నేను వేదాంతం బోధించడం లేదు. అత్యాధునిక అర్థశాస్త్ర విషయ మిది. అందుకని సంపత్తిదానపు వాస్తవిక రూపం శ్రమదానమే. శ్రమయే సంపత్తి. శ్రమకు మరో రూపం లభించినపుడు అది సంపత్తి అనబడుతుంది. తమతమ తిండికీ గుడ్డకూ సరిపోయే వస్తు వుల్ని ఉత్పత్తిచేయవలసిందనీ, అందులో కొంతభాగాన్ని సంఘసేవకు అర్పించాలనీ మనం ప్రజానీకానికి వివరించుదాం. అయితే ఇవ్వాళ

పడచుకొని వున్న ఈ మాయాజాలాన్ని మనం త్రెంచుకోజాలడంలేదు. ఈ దృష్టితో మన మాలోచిస్తే, ప్రతి వ్యక్తి వద్దా మనం సంపత్తి దానం తీసుకోవాలనే విషయం స్పష్టపడుతుంది. ముఖ్యముగా నేను చెప్పదలచుకున్న దేమంటే సంపత్తి అనేది వట్టి పనికిమాలినది. సంపత్తి పనికిమాలినది అనే విషయం మనం మనస్సులో వుంచుకుంటే అసలు ప్రతిష్ఠ క్రమేపి తక్కువతుంది. ఇదే సంపత్తిదాన విధానం.

## ఈ పనికి ఎవరు పూనుకుంటారు ?

ఈ సంపత్తిదాన కార్యక్రమానికి ఎవరు పూనుకుంటారు ? అనే మరో విషయాన్ని గూర్చి కూడా మీ రాలోచించండి. జాజూజీ గతించారు; జమునాలాల్ జీ గతించారు. వీరిద్దరిలో ఎవరు బ్రతికివున్నా ఈ కార్యక్రమాన్ని వారు నిర్వహించేవారే. జమునాలాల్ జీ చాలాసార్లు స్మరణకు వస్తారు; ఇప్పుడుగూడా జ్ఞాపకానికొచ్చారు. సరే, వారైతే తమ పనిని చేసి వెళ్ళారు. వారి స్మృతిలోనే ఈ పనంతా జరగవలసియున్నది. వారి స్మృతే మనకుంటే వారున్నప్పుడు జరిగిన పనికన్నా ఎక్కువపని ఇప్పుడు మనం చేయగలం. వారున్నప్పుడు స్మృతి ఒకే దేహంలో పరిమితమై వుండేది. ఈ పనిలో చాలా ఉత్సాహాన్ని కనపరచిన జాజూజీ, జమునాలాల్ జీ లాంటి వ్యక్తుల తర్వాతగూడా కార్యక్రమాలు ఏ విధంగా నడవవలెనో ననే విషయాన్నే మన మిప్పుడాలోచించాలి.

విజయవాడ
13 డిసెంబరు 1955.

# సంపత్తి దానము



## మొదటి భాగము

## సమ విభాగము

సమ విభాగము అనే ఆశయంలో ఇమిడి వున్న భావము ఎట్టిదనగా స్వాభావికమైన అవసరములను పూర్తిచేసుకొను సాధన సామగ్రి ప్రతి మానవునికిని వుండవలెను; అంతకంటె ఎక్కువ పనికిరాదు. దృష్టాంత పూర్వకంగా ఈ విషయమును వివరించెదను. ఒకరి జీర్ణశక్తి తక్కువగా వున్నందువలన, అతనికి పదితులముల రొట్టె చాలును; మరొకరికి జీర్ణశక్తి ఎక్కువగా వున్నందువలన, 40 తులముల రొట్టె అతనికి అవసరం కాగలదు. ఇద్దరి అవసరములు ఆ విధంగానే పూర్తికావలెను. ఈ ఆదర్శ మును అమలు పరచుటకై, సమాజ వ్యవస్థను పునర్నిర్మాణం చేయవలసి వుండును. అహింసపై నడిచే సమాజం ఈ ఆదర్శము నకు మారుగా మరొక దానిని స్వీకరించుట అసంభవం. ఒకవేళ అంతవరకు మనలో చేరలేక పోయినప్పటికీ, ఎల్లప్పుడు ఈ ఆదర్శ మును మనసులో వుంచుకొని దానిని సమీపించుటకు అనవర తము ప్రయత్నం చేస్తూ వుండవలెను. ఎంతవరకు ఈ ఆదర్శము వైపుకు మనం పురోగమించెదమో, అంతవరకు మనకు సంతో షము, సుఖము లభ్యము కాగలవు; అంతవరకు అహింసపై నడిచే సమాజమును సృష్టించే ఉద్యమమునకు మనద్వారా సహాయము కలుగును.

## ప్రారంభించు మార్గము

అహింసా పద్ధతిలో సమ విభాగము ఏవిధంగా జరుగ వలెనని ప్రస్తుతము మనం ఆలోచన చేసెదము. ఈ మార్గంలో మొదటిమెట్టు ఏమనగా ఈ ఆదర్శమును తన జీవనములో ఒక భాగముగా చేసుకున్న వ్యక్తి అవసరమైన పరివర్తనమును తన జీవితములో తేవలెను; భారతదేశపు పేదరికమును మనసులో వుంచుకొని, తన అవసరములను కనిష్ఠ ప్రమాణమునకు తగ్గించు కొనవలెను. వరుంబడిని పొందుటలో ద్రోహచింత లేక జూదము నకు తావుండరాదు. తన ఉనికి, వేషభాషలు తానవలంబింప దలచిన నూత్న జీవన వికాసమార్గమునకు అనుగుణముగా వుండవలెను. అతని జీవనములో ప్రతి అంశమందు సంయమము నిశ్చయము. తన జీవనంలో కాగలిగిన మార్పు సాధ్యమైనపుడే, అతడు తన మిత్రులకు, ఇరుగు పొరుగువారికి ఈ ఆదర్శమును ప్రచారం చేయగలడు.

## సంపత్తికి ధనికులు ధర్మకర్తలు

సమ విభాగము అనే సిద్ధాంతమునకు మూలంలో ఒక విషయం ఇమిడివున్నది. ధనికులవద్దగల అధికమైన సంపత్తికి వారు ధర్మకర్తృత్వము వహింపదగును. ఎందుకనగా ఈ సిద్ధాంత ప్రకారం వారు తమ ఇరుగు పొరుగువారికంటె ఎక్కువ వుంచుకొనజాలరుగదా! వేరే ఈ సిద్ధాంతం అమలు జరిగే విధానం? అహింసా మార్గంలోనా లేక ధనికుల సంపత్తిని గుంజి వేయడం ద్వారానా? రెండవ పద్ధతిలో మనం సహజంగా హింసయొక్క తోడ్పాటును పొందక తప్పదు. హింసా విధానం వల్ల సమాజమునకు ప్రయోజనం వుండదు. అందువల్ల సమాజము దుర్బలమగును. అందువల్ల అహింసక మార్గము ఉత్తమము.

ధనికుడు తన సంపత్తిని తనవద్దనే వుంచుకుంటాడు, అందులో ఎంత న్యాయంగా తన కవసరమో అంత వాడుకుంటాడు. మిగిలిన సంపత్తికి, సమాజ శ్రేయస్సు కొరకు, తాను ధర్మకర్తయై వ్యవహరించ గలడు. ఈ చర్చలో ధర్మకర్తయందు విశ్వాసమును వుంచడమైనది; అతడు నమ్మకంగా వర్తించగలడని అభిప్రాయమును వెల్లడిచేయుటయైనది.

## సత్యాగ్రహమునకు స్థానము

ఒకవేళ, మనం పూర్తి ప్రయత్నం చేసినమీదటకూడా, ధనికులు న్యాయ పద్ధతిలో పేదలను సంరక్షించకపోతే బీదలు ఆకలి బాధకు గురి అయితే కింకర్తవ్యం? ఈ ప్రశ్నకు సమాధానంగా, నేను అహింసక అసహాయ యోగమును తలపెట్టితిని. వినయ పూర్వకముగా సహాయ నిరాకరణముచేసే సాధనము దృఢతరమైనది, ఉత్తమమైనది. పేదసాదల సహకారము లేనిది ధనికులు సంపత్తిని ప్రోగుచేయజాలరు. ఈ జ్ఞానము పేదలలో వ్యాప్తి చెందినయెడల వారు బలశాలులు కాగలరు. తమకు ఆకలి చావులు సంప్రాప్తించుటకు కారణము వినాశకరమైన అసమానత అని వారు గుర్తించగలరు. అట్టి దుస్థితినుండి అహింసక సాధనములద్వారా ముక్తిపొందు మార్గమును వారు నేర్చుకొనెదరు.

ఆంగ్ల 'హరిజన్'
తేది. 25—8—40

—గాంధీజీ

రెండవ భాగము

# సంపత్తి అంతా రఘుపతిదే

[వినోబాజీ ప్రవచనముల నుండి సారాంశ రూప
మున ఈ వాక్యముల సంకలనం చేయబడెను.]

1951 ఏప్రిల్ 18న భూదాన యజ్ఞ సంకల్పమునకు సూచన లభించినది. ప్రస్తుతము దేశ మంతటా ప్రజలకు ఈ ఉద్యమం నచ్చినదని తెలియవస్తున్నది. భూదాన యజ్ఞంతో పాటుగా సంపత్తి దాన యజ్ఞమును ఎందుకు నడపకూడదు అనే ఆలోచన నా మనస్సులో వుండెను. కాని భూమి సమస్య ఒక ముఖ్యమైన సమస్య. అది పరిష్కారం కాకుంటే దేశానికి అపా యం కలుగుతుందని నాకు తోచినది. అందువల్ల, ఆరంభంలో ఇంత వరకే సమస్యను పరిష్కరించ దలుచుట మంచిదని భావిం చితిని. ఇంతేగాక, భూమి పరమేశ్వర దత్తము. అది సంశయం లేని సంగతి. సహజంగా అందరు ఈ విషయమును తెలుసుకొన గలరు. ఉత్పాదనకు మూలకారణమైన సాధనము భూమి. ఇన్ని కారణము లుండుటచేత, వెంటనే భూమి సమస్యను మాత్రమే పరిష్కరించ బూనుట ఉచితమని భావించితిని. క్రమ ప్రకారంగా ఒక్కొక్క అడుగు వేయడం అహింస ప్రణాళికకు అనుగుణమైన విషయం కూడాను.

కాని భూదాన యజ్ఞ కార్యం ముందుకు నడిచినకొలది, సంపత్తిలో భాగం అడగనిదే కార్యక్రమం పూర్తి అయ్యేట్లు అనిపించలేదు. ఈ విషయం క్రమేణ స్పష్టమవుతూ వచ్చింది. చివరకు నేను సంపత్తిలో, ఒక భాగాన్ని ప్రజల వద్దనుండి అడిగి తీసుకుందామని నిశ్చయించు కున్నాను.

ఆరవ భాగం అడగవలెనని నా కోరిక. కాని ముందు వెనుకలు ఆలోచించుకుని ఎంత భాగమిచ్చినా స్వీకరింపవచ్చును. ఇందులోని సూత్రం ఇట్లున్నది. సంపత్తిని మన పురుషార్థం చేతనే సంపాదించి నప్పటికీ, అది మనకొరకే కాదు; అందరి ఉపయోగం కొరకు సర్వేశ్వరుడు దానిని మనకు అప్పజెప్పినాడని భావించ వలెను. ఎందుకంటే, ఏ పురుషార్థ శక్తిచేత మనం సంపత్తిని సమకూర్చితిమో ఆ శక్తి పరమేశ్వర దత్తము.

సంపత్తి యంతా భగవంతునిదే. ఇది సంపత్తి దానము లోని ముఖ్యతత్వము. దీనిని మనము స్థాపన జేయవలయును. దీనికి సాధనము సంపత్తి దానముగాని సాధన దానముకాదు. సాధన దానము మన పనికి కలిసివస్తుంది. కాని ముఖ్యతత్వము సంపత్తిదానము ద్వారా తెలియ గలదు. పేదలు ధనికులు అందరు సంపత్తిదానమును అవలంబింప గలరు. బుక్కెడు గతికే ప్రతిమనిషి దీనిని అవలంబింప వచ్చును. సంపత్తిని ఆర్జించుటలో అన్యాయము వుండరాదు. ఆర్జించే పద్ధతిలో తప్పిదము ఉండ రాదు. సరియైన మార్గములో సంపత్తి ప్రాప్తము కావలెను. అందులో ఉచితమైన ఎక్కువలో ఎక్కువ భాగము సమాజమునకు అర్పణ కావలెను. మిగిలిన దానిని వ్యక్తి సేవించ వలెను. సేవించే దానికి కూడా అతడు ధర్మకర్తగా వుండగలడు. ఈ తత్వమంతా సంపత్తి దానములో ఇమిడి యున్నది.

## సమాజార్పణమస్తు

మనము యజ్ఞములో ఆహుతి యిచ్చేటప్పుడు, యిది నాదికాదు, ఇంద్రుని కొరకు, అని జెప్పినట్లుగానే నేడు మనము వ్యవసాయ మందుగాని, కార్ఖానాలందుగాని ఉత్పాదన చేసినదంతా, యిది నా కొరకుగాదు, సమాజం కొరకు, దేశం

కొరకు. (సమాజాయ ఇదం, రాష్ట్రీయ ఇదం- న మమ) అని చెప్పవలయును. మన దగ్గర వున్నదంతా సమాజమునకు అర్పణ కావలెను. తిరిగి సమాజము వైపునుండి మన అవసరముల ననుసరించి మనకు యెంత దొరుకునో అది అమృతము. చిన్నతనము నుంచి మనకు అనేకుల వలన ఉపకారములు కలుగు చున్నవి. ఆ ఋణమును తీర్చుకొనుటకై, మనము శరీర పరిశ్రమ ద్వారా యోగ్యమైన పద్ధతిలో సంపాదించిన దానిలో ఒక భాగము సమాజమున కిచ్చుట న్యాయము. ఇందులో సంవిభాగము యొక్క వుద్దేశ్యము పూర్తి కాగలదు.

## త్యాగ బంధనము - భోగ బంధనము

బ్రతికినంతకాలము ఆరవభాగము లేక యెనిమిదవ భాగము దానముగా యిస్తూ పోవలెనంటే కష్టమనిపిస్తుందని చాలమంది అనడం కద్దు. కాని, ఒకసారి పెండ్లి చేసుకుంటే బ్రతికినంత కాలం ఆ బంధనం వుండదా ? ఈ విషయమును గూర్చి వారు ఆలోచించినారా ? హిందూ ధర్మము ననుసరించి యెవరైనను సన్యసించవచ్చును. అయినప్పటికి గృహస్థుడై ఆమరణ బంధనమును స్వీకరించు మానవుడు యీ కొంచము దానము చేయు బంధనమును అంగీకరించుటకు ముందువెనుక లాడవలయునా? అందుచేత తత్వశుద్ధి గలవారు దానమును తమ జీవనములో ఒక అంగముగా చేర్చుకొనగలరు. యే విధముగా బ్రతికినంత కాలము స్వచ్ఛమైన గాలిని పీల్చి స్వచ్ఛమైన ఆహారమును భుజించెదమో, అదే విధముగా బ్రతికినంతకాలము మన సంపత్తిలో ఒక భాగమును ప్రజలకు మనం యివ్వవలెను. అసలు వున్నదంతా అర్పించవలసిందే, కాని ధర్మకర్త రూపేణావుంటూ తాను కొంచం వుంచుకొని మిగిలినదంతా యివ్వడం ధర్మం.

## మనం సంగ్రహమును యోగ్యం చేస్తున్నామా ?

మనము ఆరవభాగమును దానముగా అడుగుచున్నాము. అనగా మిగిలిన అయిదు భాగముల సంగ్రహము యోగ్యమైన దని తాత్పర్యమా ? కాని మనము దానిని యోగ్యంచేసే ప్రశ్న లేనేలేదు. ఆ మానవుడు మొత్తం ఆరుభాగాల సంగ్రహ మును యోగ్యమైనదిగానే భావించవచ్చుగాక ! అట్టి భావము నకు మనద్వారా గట్టిదెబ్బ తగులుచున్నది. కారణమేమనగా, ఆరింట ఒకభాగము అడిగి ఆ మానవుణ్ణి అసలీ విషయమై ఆలో చనకు పురిగొల్పుచున్నాము. హరి నామస్మరణ ఒకసారి చేసిన వాడు యిక మోక్షప్రాప్తికై నడుము బిగించినట్లేనని భక్తులం టారు. అట్లే ఆరింట ఒకభాగమును సమాజమునకు అర్పించే నియమమును, జీవితంలో ఒక నిష్ఠద్వారా అంగీకరించిన మాన వుడు తన సంపత్తి నంతటినీ, తన జీవనమును సంపూర్ణముగా, అంతేగాక తన శరీరమును పోషించు బాధ్యతను సమాజమునకు అర్పించుటకు నడుముబిగించినట్లేనని భావించవలయును. సంపత్తి దానయజ్ఞమును యిట్టి దృష్టితో పరిశీలించవలెను. అందుకై దూరముగా దర్శించు దృష్టి అవసరం.

## యజ్ఞమయ జీవితం

బ్రతికినంతకాలము సంపత్తిలో ఆరవ భాగమును దాన ముగా యిచ్చినంత మాత్రాన ఆ దాతకు మన తత్వము పూర్తిగా తెలిసిందని భావించరాదు. ఆ దాతవద్ద ముఖ్యమైన పరిశ్రమ వున్నట్లయితే అందులో పనిచేసే వారందరూ దానిలో భాగ స్వాములు కావలెను. ఆ విధముగా అందరికీ యెవరి భాగము వారికి లభ్యమై, మిగిలిన దానిని సేవా కార్యమందు అర్పించబడు విధానము కావలెను. యీ సంగతిని గ్రహించిన

వాడు సంపత్తిదాన తత్వమును తెలుసుకున్నట్లే. ఈ విధముగా ప్రవర్తించువాడు కొంచము భుజించినప్పటికీ, ఆ భోజనం యజ్ఞముతో సమానము. అదంతయు ఆహుతి స్వరూపము. ఈ విధముగా తన పూర్తి జీవనమును యజ్ఞమయము చేసి, సంపత్తికి ధర్మకర్తగా ప్రతి ఒక్కడు వుండవలెనని గాంధీజీ తీవ్రముగా తన భావమును వ్యక్తపరచెను. అట్టి ఆశయము యిందువల్లనే పూర్తి కాగలదు. దీనిని మనము అత్యంత ఆధునికమైన అర్థశాస్త్రముగా అంగీకరించెదము. ఇదియే నిజమైన అర్థ శాస్త్రము.

## ఇంటి ఖర్చులో భాగం

ఒకవేళ ఆదాయపు అంకెల విషయములో లెక్క వేయుట కఠినంగా తోచినట్లయితే తమ ఇంటి ఖర్చులో ఒక భాగము ఇచ్చినప్పటికీ నేను సంతుష్టి జెందెదను. ఒక వ్యక్తికి చెందిన పైసలు లక్ష రూపాయలు బ్యాంకులో వున్నవనుకొందము. అందులోనుంచి ఏబదివేల రూపాయలు ఇంటి ఖర్చుకై ఆ వ్యక్తి తీసుకుంటే, అందులో అయిదవ భాగము యివ్వమనండి. లేదా, తాను మొత్తం ఖర్చుపెట్టేదానిలో ఆరవ భాగమును సంపత్తి దానముగా ఇచ్చినా నాకది చాలును. ఇంటి ఖర్చులక్రింద పిల్లల శిక్షణ, ప్రవాసము ,వివాహము వగైరా శుభ కార్యముల ఖర్చు ఇమిడియున్నది. ఆరవ భాగము ఇవ్వక ఎవరైనను ఎనిమిదవ భాగము లేక పదవ భాగము యిచ్చినయెడల దానినికూడా స్వీకరించెదను. ఎందుకనగా, ఇది పన్ను వసూలు యేమికాదుగదా! కాని ధనికుడు తన యింటిఖర్చు క్రింద అరువై వేల రూపాయలు వ్యయము చేస్తూ అందులో నూరవ భాగము అనగా ఆరువందల రూపాయలు సాలుకు యిస్తానంటే దానిని అంగీకరించుటకు వీలులేదు. దాతకు దానము శోభ నిచ్చు

నట్లుగా యుండవలెను. ఈ విధముగా భారత దేశమంతటు ఇంటి ఖర్చులో ఆరవ భాగము, ఒక నిర్ణయమైన అంశము మనకు లభిస్తే సంపత్తి దాన యజ్ఞమునకు సంబంధించిన ముఖ్య తత్వము ప్రజలకు తెలిసినట్లే యెంచవచ్చును. దరిద్ర నారాయణునికి తన యింటిలోకి ప్రతివారు అధికార పూర్వకమైన స్థానము యిచ్చునట్లగు చున్నది. ఇదియే ముఖ్యమైవిషయము.

ఖర్చులో భాగము ఇవ్వడములో ఒక బాధ గలుగవచ్చును. వ్యాపారములో నష్టము వచ్చిన సంవత్సరము కూడా సంపత్తి దానము ఇవ్వక తప్పదు.

ఇంత భాగమని గాక ఇన్ని పైసలని నిశ్చయంగా ఇవ్వదలుచుకుంటే ఒక విషయము అట్టి వారిని గురించి ఆలోచించవలెను. ఒక వ్యక్తి నూటఒక్క రూపాయలు ఇచ్చుటకు అంగీకరించె ననుకోండి, అతని ఇంటిఖర్చులో ఆ పైసలు ఎంత భాగమౌతుందో అతడు చెప్పవలెను. అతనికి, శోభదాయకమా కాదాయని మాత్రమే చూడవలయును.

ఇంటిఖర్చు భాగమును స్వీకరించేటప్పుడు ఆ ఖర్చుయొక్క ప్రతి వివరము మనము చూడనక్కర లేదు. ఎవరి అంకెలు వారు యిస్తే దానితో మనము తృప్తి జెందవలయును. ప్రతి సంవత్సరము ఈ భాగములో కొద్దిగా హెచ్చుతగ్గులు ఉండవచ్చును. నిర్ణయంగా యిన్ని పైసలని జీవితమంతా ఇవ్వడము కష్టము కావచ్చును. భాగము ఇవ్వడమే సులభము కాగలదు.

ఈ యజ్ఞంలో పాల్గొనువారు తమ కుటుంబపు సమ్మతిగైకొని, అందరినీ సంతోషపరచి, వారి ప్రేమను చూరగొనవలెను. దైవభక్తిగలవారు ఇందులో సహాయపడితే, ఇదొక జీవన మార్గముగా ఈ ఉద్దేశ్యము ప్రజలలో చాలా వ్యాప్తి జెందగలదు. సామ్యయోగంవైపు సమాజం సహజంగా మొగ్గుతుంది.

## "యజ్ఞ" మనే శబ్ద మెందుకు ?

సంపత్తి దాన యజ్ఞంలోని 'యజ్ఞ' శబ్దం బాగా ఆలోచించిం తర్వాతే వాడ బడింది. ఇది ఎలాంటి సిద్ధాంత మంటే దీన్నుంచి ఎవరూ తప్పించుకోలేరు. ఈ యజ్ఞంలో 'ఆహుతి' ఇచ్చే అవకాశం ప్రతి వ్యక్తికీ లభిస్తుంది. అందరికీ వర్తించే ధర్మ కార్యాలు; ఉదాహరణకు సత్యము మొదలైనవి, అతురశః సార్వజనీనములు — అంటే అందరికీ వర్తించేవి. వీటి ముఖ్య లేక ప్రాథమిక ధర్మము 'నః తాని ధర్మాణి ప్రథమాని ఆసన్' అని పెద్దలంటారు.

## ప్రతివ్యక్తీ సంపత్తిదానం ఇవ్వాలి

సంపత్తిదానం అందరికోసం. భూదానం ఇచ్చేవారు పది మంది ఉంటే సంపత్తిదానం ఇచ్చేవారు యాభై మంది తప్ప కుండా ఉండాలని నేను అనుకున్నాను. భూమి కలిగివున్న వారే భూదానం ఇస్తారు. కాని సంపత్తిదానం తిండి తినేవాడల్లా ఇస్తాడు. తిండి తినని మనుష్యు లెవరైనా మీరు చూశారా ? అందుకని ఇది, బీదవాడూ, ధనికుడూ అనే భేదం లేకుండా అందరినీ అడగాలి. అనుభవించకముందు ఒక భాగం ప్రపంచానికి వదలి మిగతాది అనుభవించాలి. ఇది నేనేం కొత్తమాట చెప్పటం లేదు. హిందూ, ముస్లిం, క్రైస్తవ మతాచార్యులందరూ ఈ మాటే చెప్పారు. అయితే అది పరిమితంగా ఉండేది. దాన్ని వారు 'జకాత్' మొదలైన పేర్లతో పిలిచేవారు. అది దానంగా ఇవ్వబడేది. ఎవడికైతే భగవంతుడు తిండి పెట్టాడో, బ్రతుకుదెరువు కల్పించాడో వాడు అందులో కొంత భాగాన్ని ఇతరుల కివ్వాలె అనేమాట ఎలాగూ ఉండనే ఉంది; కాని అదొక ప్రత్యేకమైన ఉద్దేశంతో ఉండేది. అంటే దేవాలయాల

కోసం, మసీదులకోసం, ఉపాసనకు, అధ్యయనానికీ - అధ్యాపనకూ వాటిని ఉపయోగించేవారు. దీన్నే ప్రజలు పాంథులకు చేసే ధర్మం అంటూండేవారు. దీనివల్ల వారికి బాగా ఉపయోగం కలుగు తుండేది.

## భూతదయా సముద్రం

భూతదయ అని మనం దేన్నంటున్నామో — ఉదాహరణకు, వితంతువుల, అనాథల సహాయం మొదలైనవి — దానివల్ల దీని ఉపయోగం మరొక విధంగా కలిగేది. కాని మనం భూతదయ అనే నదిని ప్రవహింపజేయ దలచుకోలేదు; భూతదయా సముద్రం నిర్మించాలను కుంటున్నాం. మనం కరుణా రాజ్యం నిర్మించాలనుకుంటున్నాం. ఆ కరుణా రాజ్యంలో 'కరుణ' చేతిలో రాజ్యాధికారం ఉంటుంది. మిగతా శక్తులన్నీ దానికి దాస్యం చేస్తాయి. కాని ప్రస్తుతం ఉన్న పరిస్థితులేవంటే, ఇతర శక్తులన్నీ రాజ్యాధికారంలో ఉన్నాయి— కరుణేమో ఆ శక్తులకు దాసిలాగా పని చేస్తున్నది. కరుణా రాజ్యాన్ని వాళ్లేం స్థాపించగలుగుతారు? — సాధారణులవలె అనాధలు, వితంతువులు మొదలగు వారికి సహకరించటమే కాదు మన పని; సంఘంలో గొప్ప పరివర్తనం తీసుకుని వచ్చి, స్వంత ఆస్తి విధానాన్ని రూపు మాపే ఆశయాన్ని ప్రజానీకం హృదయాల్లో గట్టిగా నాటటం మనకర్తవ్యం. "నా దగ్గరున్న సంపత్తి అందరిదీని, అందరి కోసమూను - అందులో నేనూ వచ్చాను. అలాగే ఇతరుల వద్ద ఉన్న సంపత్తిగూడా అందరిదీ, ఇతరులదీని - అది ఎవరివద్ద ఉన్నదో వారిదీ - నా దీని" ఈ విధంగా మనం ఒక్క గొప్ప సిద్ధాంతాన్ని ప్రచారం చేయదలచుకున్నాం. ఈ సిద్ధాంతంవల్ల సంఘంలో ఏ విషయంలోనూ ఎలాంటి కరువూ ఉండదు. ఇది

దారిద్ర్యపు పంపకం కాదు; వ్యక్తిగత ఆస్తి నిర్మూలనమూ, సమాజానికి వ్యక్తిత్వపు సమర్పణమూ యిది. ఇది ఇష్టపూర్వకంగా, స్వేచ్ఛాయుతంగానే జరుగుతుంది, గాని జబర్దస్తీతో కాదు.

## సమూహంతోనే సార్థక్యం

నా చేతులు నా శరీరానికి సేవ చేయడంవల్ల సార్థకమౌతాయి. అందులోనే అవి ధన్యమౌతాయి. చెయ్యి ఎప్పుడూ 'నా కోసమే పని చేసుకుంటాను!' అని అనదు. అది కాళ్లకు కూడా సేవ చేస్తుంది. కాలికి ముల్లు విరిగితే దాన్ని తియ్యాలనే ఉత్సుకత చేతికి కలుగుతుంది. దాని మనసులో ఎలాంటి ఉచ్ఛనీచభావా లుదయించవు. కంటిలో నలుసుపడితే దాన్ని తియ్యడానికి చెయ్యి ముందుకు వస్తుంది. కాలికి పదన్నా మైల అంటితే దాన్ని శుభ్రపరచడానికికూడా చెయ్యే ముందుకు వస్తుంది. తనను వేరుగా అదెప్పుడూ భావించదు. ఈ శరీరంనుండి తన్ను కోసి ప్రక్కకు పెడితే తానెందుకూ పనికి రాననే సంగతీ, నా శోభంతా, నా జీవశక్తి అంతా, నేను ఒక సమూహంతో కలసి ఉండటంలోనే ఇమిడి ఉన్నది—అనే విషయం దానికి తెలుసు. అందుకని, సంఘంలో ఉన్న ప్రతి వ్యక్తీ—అఖండంగా నిత్యదానాన్ని ప్రవహింపజేయాలనీ, ప్రతి వ్యక్తి ఇంటిలో సంఘపు బ్యాంకు ఉండాలనే ఒక వినూతనమైన సిద్ధాంతం ఈ సంపత్తి దానంలో ఉంది. పూర్వకాలపు విరాళాలకు దీనికీ చాలా తేడా ఉన్నది. ఈ రెంటిలో ఎలాంటి సామ్యమూ లేదు.

## విరాళాలకూ సంపత్తి దానానికీ తేడా

విరాళాలు సేకరించేవారు డబ్బును తమ చేతికి తీసుకుంటారు; కాని ఇందులో మనం డబ్బును చేతికి తీసుకోం.

విరాళాలు సేకరించేవారు ముందుగా పెద్దవాళ్ల దగ్గరికి పోతారు-కాని ఇందులో మనం సర్వసాధారణులవద్దకు పోతాం. విరాళాలూ మొదలగునవి, ప్రజాందోళన రూపాలు కావు; కాని ఇది ప్రజాందోళన రూపం. విరాళాల్లో నిశ్చితమైన ఒక మొత్తం ఇవ్వబడుతుంది, కాని ఇందులో ఆదాయంలోని ఒక నిశ్చిత భాగం ఇవ్వబడుతుంది. విరాళ మిచ్చిన వ్యక్తి ముక్తుడౌతాడు, విరాళం పుచ్చుకొన్న వ్యక్తి బంధింప బడతాడు; కాని ఇందులో ఇచ్చేవాడు తనను తాను శాశ్వతంగానో తాత్కాలికంగానో బంధించుకుంటాడు. తీసుకొనేవాడు అనేకమైన చింతలనుండి విముక్తుడౌతాడు. విరాళాలను వినియోగించే బాధ్యత పుచ్చుకునేవాడిది, కాని ఇందులో ఆ బాధ్యత ఇచ్చేవాడిదే. అయితే సమితి ఆతనికి మార్గదర్శకత్వం వహిస్తుంది. విరాళాల్లో దాతలు పుచ్చుకున్న వారినుండి లెక్కలు అడుగుతారు. ఇందులో పుచ్చుకునే వాడే దాతను లెక్క అడుగుతాడు. విరాళాలద్వారా వసూలైన నిధి ఏవిధంగా ఉపయోగ పడుతున్నదీ - చాలా అరుదుగా ప్రజానీకానికి తెలుస్తుంది. కాని ఇందులో ఆ నిధి స్థానికంగానే ఖర్చవుతుంది కనుక, అందరికీ తెలుస్తుంది. అందరి ముందరే ఖర్చవుతుంది. విరాళాల్లో ఇచ్చేవారు తమను యజమానులను కుంటారు, కాని ఇందులో ఇచ్చేవారు తమను యజమానులనుకోరు - పైగా 'వత్' 'పంచు' లేక 'ధర్మకర్త' అనుకుంటారు. విరాళాల్లో ఇచ్చేవారు సమాజానికేదో మహోపకారం చేస్తున్నట్లు కీర్తించ బడతారు. కాని ఇందులో ఇచ్చేవాడు "నాకో సిద్ధాంతం ఒసగ బడింది. నా సంపదలోని, ఒక భాగాన్ని సంఘపు పనుల్లో నేను వినియోగించాలి. ఇలాంటి అవకాశం కలిగినందువల్ల నాకెంతో ఉపకారం కలిగింది" అని భావిస్తాడు.

ఈ విధంగా పూర్వపు విరాళ పద్ధతులకూ ఈ సంపత్తి దానానికీ పోలికలు లేవనే సంగతిని మీరు గుర్తిస్తారు. ఎక్కడెక్కడ భూదానోద్యమం ఆరంభమైందో, ఎక్కడెక్కడ అధికంగా భూమి లభించిందో, అక్కడక్కడ— సంపత్తి దానానికి అధికంగా ప్రోత్సాహం లభించే ఒక నైతిక వాతావరణం సృష్టింపబడు తుందని నేను విశ్వసిస్తున్నాను. ఇందులో డబ్బులే ఇవ్వాలనేం లేదు. ధాన్యం పండించే వారు తమ ధాన్యంలో ఒక భాగాన్నివ్వవచ్చు. కాగితం తయారు చేసే కార్ఖానా యజమాని కాగితంలో భాగాన్ని ఇవ్వవచ్చు. ప్రింటింగు ప్రెస్సు వాళ్లైతే వారు రెండు మూడు రోజుల శ్రమను దానం చెయ్యవచ్చు. ఖనిజపు యజమాను లెవరన్నా వుంటే వారు దాన్నుంచి ఉత్పత్తి చేసే వస్తువులోని ఒక భాగాన్ని ఇవ్వవచ్చు. ఈ విధంగా తమ తమ ఉత్పత్తులనుంచీ, శ్రమలోనుంచీ ఒక భాగాన్ని సంఘానికి ఇవ్వాలి.

## సాంప్రదాయ దానానికి దీనికీ తేడా

దానం మొదలగు వాటిద్వారా నడిచే పురాతన ధర్మ కార్యాలకి దీనికీ కూడా చాలా తేడా ఉంది. ఈ సాంప్రదాయ దానాలు ధర్మంకాదు. దీనివల్ల స్వర్గంలో ఏమన్నా లాభం కలిగితే కలగవచ్చు గాక, నా కలాంటి అభిలాషేమీ లేదు. పురాతన కాలపు భూత దయాత్మక ధర్మాల్లాంటిది కూడా కాదిది. అయినా భూతదయ అనేది ఇందులో సహజంగానే జరిగిపోతుంది. సమాజాన్నంతా ఏక కుటుంబం చేయాలనే విషయం ఇందులో ఉంది. సంపత్తి దానోద్యమం నడుస్తూంటే దాని దాన పత్రాలే మా చేతికి వచ్చేవి - కాని సంపత్తి ప్రతి ఇంట్లోనూ ఉంటుంది.

## డబ్బుకాదు; 'లక్ష్మి' కావాలి

సంపత్తి దాన యజ్ఞం; నేటి ఇతర నిధులకు చాలా భిన్నమైంది. దాన పత్రం తీసుకుంటాం - డబ్బుకాదు. దానాన్ని దాతే స్వయంగా బీదల సేవకోసం వినియోగిస్తాడు. అయితే బీదలకు కూడా అతడు 'పైసా' రూపంలో సహాయపడడు; సంపత్తి దానంలో ఏ వ్యక్తి కొరకు కూడా డబ్బు ఉపయోగించ బడదు. అయితే సాముదాయిక పనులకోసం ఉపయోగం కావచ్చు. ఉదాహరణకు బావికోసం సిమెంటు కొనటం, ఇద్దరు ముగ్గురు కర్షకులకు కలిపి ఒక ఎడ్లజతను కొనివ్వటం లాంటి పనులకోసం డబ్బు ఉపయోగింప బడవచ్చు.

మనం ఊరూరికీ వెళ్లి, ప్రతి ఇంటినుంచీ, ఆరవ భాగం ఎనిమిదవ భాగం, లేక పదో భాగం తీసుకుంటున్నప్పుడు వారి నుండి డబ్బు తీసుకోం. ప్రజలు ధాన్యం ఇవ్వవచ్చు, ఇంకేదైనా ఇతర వస్తువు ఇవ్వవచ్చు. ఈ దొరికే వస్తువులు కూడా సమూహానికి దొరుకుతాయి; గ్రామానికి దొరుకుతాయి. ఈ విధంగా గ్రామగ్రామంలోనూ సామూహిక లక్ష్మి కూడుతుంది. నేను 'డబ్బు' 'సంపత్తి' అనే శబ్దాల్ని ఉపయోగించ దలచుకోలేదు. వాటివల్ల అనుమానానికి ఆస్కారం కలుగుతుంది. నేను 'లక్ష్మి' అని అంటున్నాను. వడ్రంగి అయిదు నాగళ్లను చేసి ఇచ్చినా, వేరొకడు మరొక సాధనాన్ని చేసి ఇచ్చినా అదంతా సామూహిక 'లక్ష్మి' కిందికే వస్తుంది. గ్రామాల్లో మన మీ విషయాన్నే చెపుతున్నాం, నగర ప్రజలక్కూడా ఈ విషయాన్నే మనం బోధించాలి. మీ సంపత్తిలో ఇతరుల భాగం కూడా ఉందని వాళ్లకు చెపుదాం. మీరు దానికి సంపూర్ణ యజమానులని ఎలా అనుకుంటున్నారు? మీ సంపత్తికి మీరుకూడా ఒక భాగ

స్థులు. మీకూ సంఘానికీ మధ్యన విరోధ ముందని ఎందుకను కుంటున్నారు ?

## ఇంటింటా బ్యాంకు

గ్రామాల్లో ఇంటింటా మా నిధియొక్క బేంకు ఉంటుంది. సామూహిక స్థలంలో, ఇంటిలో ఎంత మిగులు ఉంటుందో దీని లెక్కమాత్రం ఉంటుంది. అంటే ప్రతి మనిషీ గ్రామానికి ఎంత దాన మిచ్చాడో, అందులో ఎంత భాగం ఇంకా అతని ఇంటిలో మిగిలి ఉన్నదో దాని లెక్క ఉంటుందన్న మాట. ధాన్యంలో భాగాన్ని మీరు తీసుకుంటూరు గదా ? దాన్ని ఊరిలో ఎక్కడో ఒక చోట కూడబెడతారా లేదా ? అని నన్ను కొందరడుగుతారు. 'కూడబెట్టము' అని నేను సమాధానం చెపుతూంటూను. కేవలం కాగితాల కట్ట మాత్రం ఒక చోట కూడబెట్టబడి ఉంటుంది. ఆ కాగితాల్లో, ఫలానా ఇంట్లో పది సేర్ల ధాన్యం, ఫలానా ఇంట్లో ఇరవయి సేర్లు, ఫలానా ఇంట్లో పాతిక సేర్ల ధాన్యం మన దున్నదని వ్రాసి ఉంటుంది. గ్రామ సమితికి పది సేర్ల ధాన్యం అవసరం కలిగితే అది వెంటనే పది సేర్ల ధాన్యం ఎవ్వరివ్వ గలుగుతారని గ్రామస్థులందర్నీ అడుగుతుంది. ఎవరో ఒకరు ధాన్యాన్ని కొలుస్తారు. అప్పుడు అతని లెక్కలో ఉన్న పది సేర్ల ధాన్యం ఐపోయినట్టు వ్రాసుకో బడుతుంది. ఈ విధంగా, ధాన్యాన్ని రక్షించే బాధ్యతను గురించి మన మాలోచించ వలసిన పని లేదు.

## అరువులో ఆనందం

విరాళాలు సమకూర్చేవారు, నగదు మీద ఎక్కువగా ఆధార పడతారు. ఎవరో ఒకరు ఐదువేల రూపాయలు దానం ఇస్తే, అవి మన చేతికి వచ్చింతర్వాత, దానం లభించిందని మన

పనుకుంటాం. కాని మనకు ఆనందం నగదులో లేదు; అది అరువులో ఉంది. మీకు మేం పదిసేర్ల ధాన్యం ఇస్తామని వ్రాసి ఇచ్చిన పత్రం మనకు సంతోషాన్ని కలిగిస్తుంది. దీనికి బదులుగా నా ముందు పదిసేర్ల ధాన్యం ఎవరన్నా కొలిచినా, నేను వద్దంటాను. మాకు నగదు వద్దు; అరువు కావాలి. మా కవసరం కలిగినప్పుడు చీటీ పంపిస్తాం, తదనుసారంగా మీరు పని చెయ్యాలి అని చెప్పేస్తాం.

## సంపత్తి దానమూ; బుద్ధిదానమూ

మహారాష్ట్రనుండి ఆచార్య లిమాయె ఉత్తరం వ్రాశారు. ఆయన గొప్ప తత్త్వజ్ఞాని. ఆయన సంపత్తి దానానికి తన భాగం ఇచ్చారు. మీవి, 2500 ల రూపాయలు నావద్ద ఉన్నవి. అని ఆయన రాశాడు. "సంపత్తి దానం ఇచ్చేవాడు తనకు తోచిన విధంగా అందులో మూడోవంతును ఖర్చు చేయవచ్చునని మీరు అన్నారుగదా! అందుకని అందులోనుంచి ఎనిమిది వందల రూపాయల్ని నాకు తోచిన విధంగా ఖర్చుచేసి, దాని లెక్కను మీకు పంపుతాను. మిగతా 1200 రూపాయలు ఒక కార్యకర్తకు ఇస్తాను. నెలకు వందచొప్పున ఇవ్వాలని, దానికర్హుడైన కార్యకర్తను ఎన్నుకున్నాము. అతను చాలా మంచి కార్యకర్త. మా తరఫున మీ రాయనకు అంతడబ్బు ఇవ్వవచ్చు; అంటే — మీరు ఒప్పుకుంటే మీ ఆజ్ఞానుసారం ఆ వ్యక్తికి మేము అంత డబ్బును ఇవ్వగలము. నాలుగు వందల రూపాయలు సాధన దానంకొరకు ప్రత్యేకించాను. ఇందులోంచి బీదవారికి సహాయం చేయబడుతుంది. మిగిలిన వంద రూపాయల్ని సాహిత్య ప్రచారానికి ప్రత్యేకించాను" అని ఆయన వ్రాశారు. శ్రీ లిమాయె, మన కేపనినీ మిగల్చలేదు. ఏ విధంగా ఎంతెంత పంచాలో అంతా

ప్రణాళిక వేసుకోవటమే కాక, కార్యకర్తనుకూడా ఎన్ను కున్నారు. ఆ ప్రణాళిక మనకు ఇష్టమో కాదో తేల్చి చెప్పితే చాలు, ఈ విధంగా ఆయన సంపత్తిలో భాగమివ్వటంతోబాటు బుద్ధిలోకూడా భాగాన్నిచ్చారు. మేం కోరే దిదే.

## సంపత్తిదానం అత్యంత పరిశుద్ధమైంది

ఒక గ్రామములోని ప్రజలు సంవత్సరంలోని పన్నెండు దినాల శ్రమవల్ల పొందిన ఉత్పత్తిని సంపత్తిదానం* చేశారు. విషయం చిన్నదే; కాని నాకీ విషయాన్ని గూర్చి కావ్యం వ్రాయాలనిపిస్తున్నది. శ్రమ దానం వేరు; సంపత్తిదానం వేరు. ఇందులో శ్రమ దానం కూడా ఉన్నది; కాని దీని ఉత్పత్తి సంపత్తి దానానికే చెందుతుంది. చాలామంది సంపత్తిదానం చేస్తారు; అది వారి శ్రమఫలితమే. అయినా ప్రజాకార్యానికి నేరుగా శ్రమను అర్పించటం శ్రమదానం; శ్రమద్వారా ఉత్పత్తి చేయ బడిన ఫలితాన్ని దానం చేయటం సంపత్తిదానం. వీరు పన్నెండు రోజుల శ్రమ ఇస్తామన్నారు. అంటే ఆదాయంలో 30 వ భాగం అన్నమాట. ఇది చాలా పరిశుద్ధమైన సంపత్తిదానం. ఎందుకంటే ఇతరులనుంచి మనం పొందే ఆదాయంలోని భాగంలో, తప్పుడు విధానాల ద్వారా సంపాదించిన సంపత్తి ఉండటానికి అవకాశం ఉన్నది. 'మీరు ఆదాయంలో భాగం స్వీకరిస్తున్నారంటే, ఆ ఆదాయాన్ని ఏ మార్గాల ద్వారా పొందుతున్నారో ఆ మార్గాల్ని మీ రామోదిస్తున్నా'రన్న ఆక్షే పణ సంపత్తిదానయజ్ఞం మీద ఉన్నది. ఇలాంటి ఆక్షేపణ, శ్రమ రూపంలో ఉన్న ఈ సంపత్తిదానపు విధానంమీద చేయ బడటానికి అవకాశం లేదు. సంపత్తిదాన యజ్ఞంమీద ఏదైనా ఆక్షేపణ ఉంటే ఆదాయాన్ని పొందే విధానాన్ని నియమబద్ధం

చేయటం లేదనేదే. ఆ సంపత్తి దానాన్ని ఎలా వినియోగించాలనే విషయాన్ని మనం నిర్దేశించేట్లయితే, దాన్ని ఎలాపొందాలనే విషయాన్నికూడా నియమబద్ధం చేయవచ్చు. ఇదే పై ఆక్షేపణకు సమాధానం.

## డబ్బుకంటే మాటకే విలువ

సంపత్తిదాన యజ్ఞము చాలా గంభీరమైన విషయం. భూదాన యజ్ఞంలో ప్రతి ఒక్కరియొద్ద భూమి అడుగుతున్నాము. ప్రత్యేక దాన పత్రము తీసుకుంటున్నాము. దానిమీద దాత సంతకం వగైరా తీసుకుంటున్నాము. అప్పుడు సర్కార్ వారు దానిని మంజూరు చేస్తున్నారు. అంతట దాన పత్రం అమలు జరుగుతున్నది. అంత పెద్ద ఏర్పాటు సంపత్తి దాన యజ్ఞంలో లేదు. అందుచేత, వచన పత్రమును వ్రాసి ఇచ్చిన వ్యక్తి తనలోని భగవంతుని సాక్షిగా తన వాగ్దానమును పాలించగలడు. దానమిచ్చిన సంపత్తి వినియోగపు లెక్కను గూడా క్రమంగానే వుంచగలడు. మనము చెప్పినట్లుగా ఆ దానమును పూర్ణముగా ఉపయోగించుటకు దాతయే ఉత్తరవాది కాగలడు. ఈ సంపత్తిదానం భూదానంవలె ఒక ఏడాది ఇచ్చి ముగించుకునేదిగాదు. ప్రతి సంవత్సరం భాగం పంచి ఇవ్వవలసినదే. అందువల్ల, ఈ పనికొరకు జీవనమును నిష్ఠతో నింపవలసి అవసరం గలదు. వ్యక్తిలోపల వున్న నిష్ఠ జాగృతి పొందవలెను.

ఒక పత్రికా రచయిత నామీద తన వ్యంగ్యోక్తిని ప్రయోగించి యిట్లనెను: "వినోబాకు భూమి అవసరంలేదు; సంపత్తి అక్కరలేదు. అతడికి కావలసినవి దాన పత్రములు. ఈయన కాగితాలడిగే దేవుడు. పుష్పము లడిగే దేవునికి పుష్పము

ఓచ్చినట్లే కాగితాలడిగే యీ దేవుని మెడలో దాన పత్రాల దండ గుచ్చివేయండి; రమారమణ గోవిందో హరి!"

అతడు యిదంతా పరిహాసానికి వ్రాసినా, నిజంకూడా అంతే. యెందుకంటే, ఒక దాత యిచ్చే పైసకంటే అతని వచనమే నా దృష్టిలో యెక్కువ విలువగలది. నేడు సంపత్తి దాన యజ్ఞంలో దాని వినియోగమును గూర్చి కట్టు దిట్టమైన సంరక్షణ వున్నది. కాని కోట్లకొలది దానం యీ ప్రకారం దొరికినప్పుడు దాని వినియోగమును గూర్చి ప్రత్యేకముగా నిర్దేశించుట సంభవము కాదు. అప్పుడు యెక్కడికక్కడే చక్కగా అంతా వినియోగం కాగలదు.

## సంపత్తి దానపు ఉపయోగం

సంపత్తి దానపు ఉపయోగంలో మూడు విషయాలున్నాయి. బీదలకు నేరుగా సహాయం లభించడం అందులో మొదటి విషయం. భూమి పంచబడుతుంది. భూమిని సాగు చేయటానికి, విత్తనాలు, ఎడ్లు, బావి, మొదలగు విషయాల్లో రైతుకు సహాయపడవలసి ఉన్నది. సంపత్తిదానపు రెండవ ఉపయోగం కార్యకర్తలను తయారు చేయడానికి; అంటే కార్యకర్తల బ్రతుకుదెరవుకోసం ఉపయోగ పడుతుంది. సిద్ధాంత ప్రచారం, సాహిత్య ప్రచారం, మొదలగు వాటికి వినియోగించడం—అంటే సాహిత్యాన్ని చౌక ధరలకు అందించడం మూడవ ఉపయోగం. ఇందులో దేనికి మీరు ప్రాముఖ్యత నిస్తారని నన్నడిగితే, నేనిచ్చే సమాధానం, నాతో అపేక్షించబడే సమాధానంకంటే చాలా భిన్నంగా ఉంటుంది. బీదలకు నేరుగా సహాయ పడటమే అన్నిటికంటే శ్రేష్ఠమైన ఉపయోగమని నేను సమాధానం చెపుతా ననుకుంటున్నారేమో? — సంపత్తిదానం

లోని అధికతర భాగం బీదల సహాయానికే ఉపయోగింప బడు తుందనటంలో సందేహంలేదు. కాని సంపత్తి దానపు శ్రేష్ఠతర మైన ఉపయోగం ఎక్కడ జరుగుతుందనే దాన్ని విచారించి నప్పుడు — అది కార్యకర్తలను తయారు చేయడంలోనూ, వారికి బ్రతుకు దెరవు కల్పించటంలోనే అనేది స్పష్టం. ఇదే అన్నిటి కంటే శ్రేష్ఠమైన, ముఖ్యమైన, మహత్త్వపూరితమైన ఉప యోగం. మొత్తమ్మీద కార్యక్రమమంతా బీదల సేవకోసమే. పిల్లల్ని పోషించడానికి ముందు తల్లుల పోషణ అవసరం. ఈ కార్యక్రమంలో మాతృస్థానంలో ఉన్నవారు కార్యకర్తలే. తల్లి పాలమీద ఆధారపడే శిశువు ఆరోగ్యంకూడా తల్లి ఆరోగ్యం మీద ఆధారపడుతుంది. అందుకనే మాతృపోషణ గురించి బాగా ఆలోచించవలసిన అవసరం ఉంది. లేకపోతే పిల్లల పోషణ గూడా ఉత్తమంగా ఉండజాలదు.

## సేవకులకు ప్రథమస్థానం

"సంపత్తి దానం కార్యకర్తలకోసం ఉపయోగపడాలని బాబా అంటున్నారు" అని ఒక సోదరుడన్నాడు. ఇందులో కొంత పొరపడటానికి అవకాశం ఉంది. సంపత్తిదానం సేవకులకే ఎందు కుపయోగింప బడాలి? అనే విషయంలో నేను కొంతగా వివరించాను. ఏ కార్యకర్తలద్వారా ఈ కార్యక్రమం ప్రచారం కావలసి ఉన్నదో ఆ కార్యకర్తలే తమ కాళ్లపై తాము నిలుచుండ జాలనప్పుడు ఈ కార్యక్రమమే అంతమై పోతుంది. కాని ఆ సోదరునికి సంతృప్తి కలుగలేదు. కార్యకర్తల బ్రతుకు తెరువుకోసమే ప్రణాళిక వేయబడుతుందని సమాజం అనుకోవచ్చుగదా? అంతకన్నా ఇందులో ఎక్కువేముంది? అనేది ఆ సోదరుని సందేహం. ఈ సందేహానికి ఇందులో ఉన్న

అవకాశాన్ని—దాని సమాధానాన్ని స్పష్టంగా మనం తెలుసుకోవాలి. ప్రతి ఇంటినుంచి ఆరవభాగం రావాలని మనం అనుకుంటున్నాం. ఒక గ్రామంనుంచి ఒక్కరికంటే ఎక్కువ కార్యకార్యకర్తల్ని మనం ఆశించం. యాభై ఇళ్ల గ్రామం ఒకటి ఉందనుకోండి. ఆ యాభై ఇళ్లవాళ్లూ ఒక కార్యకర్తను పోషించే బాధ్యత వహించాలని వారినుండీ మనం ఆశిస్తాం. వారిచ్చే దానంలోని యాభయ్యో భాగమే ఇందుకు చాలు. మనం ఆరవభాగాన్ని అర్థిస్తున్నాం; మనం అర్థించే దానిలోని చాలా తక్కువ భాగమే కార్యకర్తలకోసం అపేక్షింప బడుతుందనే విషయం స్పష్టం. అయినా ఇందులోనుంచి కార్యకర్తలకు మేమేదో ఇస్తున్నా మనుకున్నా, ఇందులో ఆక్షేపించ వలసిన విషయ మేమీలేదు.

## ఒక్కొక్క గ్రామంనుంచి ఒక్కొక్క కార్యకర్త

సమష్టి లేక సామూహిక కుటుంబాలున్నచోట, ఒక్కొక్క కుటుంబంనుంచి, సాంఘిక సేవకోసం ఒక్కొక్క కార్యకర్త నివ్వటం సులభమౌతుంది. గ్రామదానాలు మొదలగు వాటితో మనం గ్రామాన్నంతా ఒకే కుటుంబంగా ఏర్పాటు చేస్తున్నాం. ఇలాంటి కుటుంబాలనుంచి గ్రామసేవకోసం ఒక కార్యకర్త లభించాలని మనం ఆశించవచ్చు. ఆ కార్యకర్త కుటుంబ పోషణ భారం గ్రామస్థులు వహిస్తారు. ఆ కార్యకర్తకూడా పనిచేస్తాడు; శరీరశ్రమ—ఉత్పత్తికి సంబంధించిన పనీ చేస్తాడు. కాని అతడు గ్రామ సేవలో నిమగ్నుడై ఉంటాడు. అతను గ్రామంలోనే జన్మించినవాడై ఉంటాడు. గ్రామ గ్రామాల్లో ఉండే కార్యకర్తలు ఆయా గ్రామాలకు చెందినవారే అయి ఉంటారు. కనుక ఇందులో ఏలాంటి భ్రమకూ అవకాశం లేదు; ఎవరూ శంకించ

వలసిన కారణం లేదు. అయితే విడి కార్యకర్తలుకూడా కొందరుంటారు. ప్రపంచంలోని విజ్ఞులైన వారిని మనం తప్పకుండా కోరుకుంటాం. అయితే వారినికూడా ఎవరిమీదా రుద్దం; వారు పనిచేసే క్షేత్రంలోని ప్రజానీకం ఇష్టం మీదే, వారి ప్రేమాభిమానాల సహాయంతోనే ఆ యా క్షేత్రాల్లో వారు పనిచేస్తారు. ఆ ప్రాంతపు ప్రజానీకం వారిని ఇష్టపడకపోతే వారి నక్కడ ఉంచం. కనుక కార్యకర్తలు, ఆ యా గ్రామాల వారైనా అవుతారు; లేక ఆ యా ప్రాంతపు జనుల సమ్మతి నొందిన ఇతర ప్రాంతీయులైనా అవుతారు.

## ఎవరు బీదలు ?

గ్రామంలో లభించిన సంపత్తి దానంలోనుంచి ఒకభాగం గ్రామసేవకుల, కార్యకర్తల కుటుంబ పోషణకోసం ఖర్చవుతుంది. మిగతా మొత్తం గ్రామంలోని బీద లందరికోసం ఖర్చవుతుంది. గ్రామమంతా ఒకే కుటుంబమైనప్పుడు, ఇంక పేదలుగా మిగిలే వారెవ్వరు? అప్పుడు ఎవరికి సేవ చేయవలసిన అవసరం ఉంటుంది? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. 'బీదలు' అనే దానికి మా వ్యాఖ్యానమేమిటో మీకు వివరిస్తాను. 'విద్య' లేనివాడు, శక్తి, బుద్ధి తక్కువ కలవాడు బీదవాడు. గ్రామాల్లో ఉండే ఇటువంటి వారంతా బీదవాళ్లు. తమవద్ద వేనకు వేలు రూపాయలుంచుకొన్న వారినికూడా, వారికి పరిశ్రమించే శక్తి లేనప్పుడు వారిని బీదవాళ్లు అనే అంటాము. ఈ విధంగా బీదవారు అనేక రకాలవా రుంటారు. కొందరు శరీరశక్తి లేని బీదవారు, మరికొందరు బుద్ధిబలం లేని బీదవారు. ఈ విధంగా ప్రకృతి సిద్ధంగా జన్మించిన బీదవాళ్లు, సమాజంనుంచి జన్మించిన బీదవాళ్లు—వీళ్లందరిని గురించి మన మాలోచించాలి. శారీరక శ్రమ ప్రధానమైన సం

ఘంలో ఏదో. కారణంగా శారీరకశ్రమకు అసమర్థుడైన వ్యక్తి బీదవాడుగా లెక్కింప బడతాడు. అయితే శారీరక శ్రమకు అస మర్థుడైనప్పటికీ, ఆతని బుద్ధి బాగా వికసించేట్లయితే ఆతని బీద తనం మటు మాయం అవుతుంది. కాని ఏ వ్యక్తి బుద్ధి వికసించనే లేదో, శారీరక పరిశ్రమకు ఏ వ్యక్తి అసమర్థుడో అలాంటి వ్యక్తి పూర్తిగా బీదవాడన్న మాట. అతడే సహాయానికి పాత్రుడు. గ్రామంలో లభించే సంపత్తిదానం, ఈలాటి బీదవాళ్లందరికీ ఉప యోగింప బడుతుంది.

## సంపత్తిని సోమరిని చెయ్యాలి

శ్రీమంతులవద్ద ఉన్న సంపత్తిని బాబా ఎలా లాక్కుం టాడో చూడాలి అని చాలామంది అను కుంటున్నారు. మనం వాళ్లదగ్గరుండే సంపత్తి విలువనే అంతమొందిస్తామని నేను వాళ్లకు చెపుతున్నాను. తన విలువను పెంచడానికి ఆ సంపత్తే స్వయంగా వెతుక్కుంటూ మనవద్దకు వస్తుంది. శ్రీమంతులందరూ మన దగ్గరకువచ్చి 'బాబా! దయచేసి మా సంపత్తి నంతట్నీ తీసుకో, మాకు మా ప్రతిష్ఠను మాత్రం ఇప్పించు' అని ప్రార్థి స్తారు. ఇప్పటిదాకా విరాళాలు ప్రోగుచేసేవారు, ఈ పెద్దపెద్ద వాళ్ల దగ్గరికి వెళ్లేవారు. అనవసరమైన గౌరవం అందులో వీరికి లభించేది. వారి నైతిక జీవితం ఏమిటి? ఎందరిని పీడించి వారు డబ్బు సంపాదించారు? అనే విషయాన్నెవరూ చూచేవారు కాదు. వారినుంచి దానం పొందటం, వారికి ప్రతిష్ఠ ఇవ్వటం జరుగుతుండేది. ఇతరులు, వారివారి పేరుమీద ఆ నిష్పత్తిలో తక్కువచేసి ఇస్తుండేవారు. కాని మనం అనవసరంగా ఈ శ్రీమంతు లకు ప్రతిష్ఠ పంచిపెట్టదలచుకోలేదు.

అసలు సంగతేమిటంటే, ఇవాళ మనం దేన్ని సంపత్తి అని అనుకుంటున్నామో అందులోనుంచి చాలావరకు సోమరి అవుతుంది. దానికి అనవసరంగా మహత్త్వాన్ని ఆపాదిస్తున్నాం. కాని, కాలంమారింది. ఆ సంపత్తియొక్క ప్రతిష్ఠ దినదినం పడి పోతున్నది. అటువంటి పరిస్థితిలో ఆ సంపత్తియొక్క పంపకానికి ఏదో మహత్త్వముంటుందని నేను భావించను. మనం అలాంటి సంపత్తిని సోమరి సంపదగా చేయగలిగితే, అలా చేయటమే మన, ముఖ్యకర్తవ్యం. ఉదాహరణకు: పిస్తోలు చూపించి ఎవరన్నా ఏదన్నా వస్తువును తీసుకోవాలనుకుంటే మనం ఇవ్వం. ఇదొక శక్తి; అలాగే మీరు డబ్బు చూపించండి, వరహాలు చూపించండి-అయినా మేం మావద్ద ఉన్న వస్తువును ఇవ్వం అంటేఇదికూడా ఒక శక్తే. ఈ శక్తి ప్రజానీకానికి రావాలి. దేనికోసం వారు పరిశ్రమించారో దాన్ని డబ్బుకు లోభపడి ఇతరుల కివ్వకుండా ఉండేశక్తి వారికి రావాలి. ఇతరులు కావాలంటే వారుకూడా పరిశ్రమించాలి. ఈ శక్తి ప్రజానీకానికి వచ్చినప్పుడు సంపత్తి చాలావరకు చెత్తాచెదారంలో కలసి పోతుంది.

## రూపాయలు వద్దు; నూలుచిలపలు ఇవ్వండి

సంపత్తి రాసులుగా కలిగి ఉన్న నా కత్యంత మిత్రులైన వారి సంపత్తి నాకేమీ ఉపయోగ పడటం లేదు. ఈ విషయంలో వారు విచారిస్తున్నారు. నేను వారిని ఐదూ, పదివేలు అడిగితే అతిప్రేమతో ఇవ్వడానికి వారు సిద్ధంగా ఉన్నారు. కాని నేను వారికి ఉత్తరాలు రాశాను. "మీరు మీచేత వడికిన నూలు చిలపలు ఇవ్వగలుగుతారు; అవే ఇవ్వండి. మీరు దరిద్రులని నాకు తెలుసు, ఇంతకన్నా ఎక్కువ మీరు ఇవ్వలేరు. అందుకని కనీసం ఒక చిలప ఇవ్వండి" అని. సంపత్తి విలువే నశించి పోయినచోట

దాని విలువ పూర్తిగా నశించకుండా ఉండాలని, దానికి కొంచ మైనా విలువ ఉండాలని వారి ప్రయత్నం.

## భూమికీ సంపత్తికీ తేడా

భూమికీ సంపత్తికీ ఎంత భేదమున్నదో ప్రజానీకానికి తెలియదు. "బాబా భూస్వాములనుంచి భూమి అడుగుతున్నాడు కాని సంపన్నులనుంచి సంపత్తి ఎందుకు తీసుకోడు ?" అని వారు అడుగుతారు. భూమి వాస్తవిక లక్ష్మి. దాని విలువ కల్పితమైంది కాదు. ఈ విషయాన్ని గుర్తించాలి. శ్రీమంతులవద్ద ఉన్న డబ్బు విలువ కేవల కల్పితం; దానికి సొంత విలువ లేదు. అందుకే నేను మొదట భూమిని పంచాలనుకుంటున్నాను; తర్వాత సర్వసాధారణుల నుండి సంపత్తిదానం పొందాలనుకుంటున్నాను; డబ్బుదానం కాదు - దాని ద్వారా ఉత్పత్తి చేయబడిన వస్తువులదానం కావాలి. అప్పుడు ఎవరివద్ద డబ్బున్నదో వారందరూ నా వద్దకు వచ్చి "బాబా, మేమేమీ ఉత్పత్తి చేయలేదు. మాకా శక్తి లేదు; మావద్ద కొంత డబ్బు పడి వున్నది; దయచేసి స్వీకరించండి" అంటూ ప్రార్థిస్తారు.

## సంపత్తిని నిర్మూలించడానికే జన్మించాను

సంపత్తిదానంలో ఉన్న 'సంపత్తి' అనే శబ్దాన్ని చూచి మీరు భ్రమ పడవద్దు. డబ్బుకు ఇందులో ఎలాంటి గౌరవమూ లేదు. నేను సంపత్తిని నిర్మూలించడానికే జన్మించానని అప్పుడప్పుడు నా జీవితంలో నాకు అనిపిస్తూంటుంది. కాలం కూడా ఈ విషయాన్నే కోరుతున్నది. అందుకని మీకు సంపత్తిదానం బాగా లభిస్తుంది. సమాజంచేత ఇవాళ ఈర్ష్యగా చూడబడేవారు, ఎవరినుంచి సంపత్తిని లాగుకోవాలి అని అన్నారో, వారూ, అందరూ మన దగ్గరికి పరిగెత్తుకుంటూ వస్తారు. కాని, సంపత్తి

దానవు సైన్యం నిల్చున్నప్పుడే ఇదంతా సాధ్యం. ఇక్కడ వేల మంది భూదానం ఇచ్చారనీ, ఇక్కడ పైపు వేలమంది సంపత్తి దానం ఇచ్చారనీ, వారు విన్నప్పుడు మనం ఏకాంతంగా ఎలా ఉండగలమని వారాలోచిస్తారు. అప్పుడు వారూ వస్తారు. వారి దానాన్ని మనం స్వీకరిస్తాం. ఇది ఒక అహింసా విధానం.

మనము స్వామిత్వమును నిర్మూలించ దలచినాము. ఇది మన సంవిధానమునకు (Constitution) అనగా రాజ్యాంగ విధానమునకు విరుద్ధం కాదా అనే ప్రశ్న వుదయించినది. అయితే సంవిధానమును దేవతలు రచించినారా యేమి? మానవుని తాత్విక పరివర్తనము కలిగిన కొలదీ, సంవిధానము మారుచుండును. బలవంతముగా మనము చేసిని ప్రయోగించుట లేదు. తెలియ జెప్పుట మనహక్కు, తెలిసికొనుట ప్రజల కర్తవ్యము. ప్రజలకు నిజము తెలియగానే సంవిధానమునకు వారు విరోధు లగుదురా? సంవిధానము దినేదినే వికాసమును పొందవలెనని మన అభిప్రాయము. స్వామిత్వము అనే భావన నిర్మూలము కావలెను. కారణ మేమనగా మనవద్ద అధికంగా బుద్ధి, అధికంగా శక్తి, మహత్వపూర్ణమైన క్రియాకలాపముల ఆధిక్యత వున్నందుకుగాను మనకు పైసలు అధికముగా లభ్యము కావలెననే వాదము చెల్లదు. ఒక జవాబ్‌దారీగల పనికి, బాధ్యత గల వ్యవహారానికి పైసలతో సంబంధమును జోడించుట శుద్ధతప్పు.

ఈ మాటను చక్కగా గ్రహించిన పేదలేగానీ, ధనవంతులు గానీ - భోగియై, సంసారిగానీ, త్యాగియైన కార్యకర్త గానీ - సంపత్తిదాన యజ్ఞములో స్వయంగా దీక్ష వహించి

పాత్రాని, ఈ ఆలోచనను ప్రత్యేక్ష క్షేత్రంలో మరింత సంశోధన చేయగలరని నేను ఆశిస్తున్నాను.

నా పనివిషయంలో ఏ విధమైన తప్పు అభిప్రాయము కలుగరాదు. ఇది ఒక ధర్మ నిర్ణయము. మానవుని ఆసక్తినుంచి విడిపించి, అపరిగ్రహంలోకి దించవలెనని నా ఉద్దేశ్యము. ఇట్లని, అత్యధికంగా పరిగ్రహం చేసిన వారి వద్దనుంచే దానం అడగ వలెనని అనుకోరాదు. ఒక లంగోటిలో కూడా ఆసక్తి అనేది వుండగలదు. అందువల్ల, ప్రతివ్యక్తివద్దకు వెళ్లి, ధర్మమును ఎరుక పరచి, దానపత్రమును ఎదుట వుంచవలెను.

## అపరిగ్రహములో శక్తి

అపరిగ్రహములో కూడ ఏదో శక్తి ఉంటున్నదనే సంగతిని మన మింత వరకు గుర్తించనే లేదు. అపరిగ్రహం ద్వారా చింతాముక్తి కలుగుతుందని మాత్రమే మనకు తెలుసు. అందు కనే 'సాధకులు పరిగ్రహమును విడువవలె'నని మనము అంటు న్నాము. సంపత్తిని వదలి, ఆలోచనకోసం విముక్తులు కావాలి. ధ్యానమూ, అధ్యయనమూ మొదలగు వాటిలో నిమగ్నులు కాగోరువారు సంపత్తి నుండి విముక్తులు కావాలి. "ఇంట్లో నాలుగు కుర్చీలు, రెండు మేజాలు, మూడు బెంచీలు ఉంటే సమయ మంతా ఊడ్వడానికే పోతుంది. ధ్యానానికి సమయమే లభించదు. అందుకని ఈలాంటి పారమార్థిక వ్యక్తులు పరిగ్రహ విముక్తులు కావాలి" అని. ఈ విధంగా మనం అపరిగ్రహము ద్వారా చింతా విముక్తి కంటె ఎక్కువ ఆశించలేము. కాని అపరిగ్రహశక్తి చూపించాలను కుంటున్నాం. అపరిగ్రహంలో ఉన్న శక్తి పరిగ్రహంలో ఉండలేదు అని గట్టిగా చెపుతున్నాం. దీనికి మన ఈ దేహమే ఉదాహరణ. ఈ దేహంలోని రక్త

మంతా అంతటా సమానంగా పంచబడి ఉంటే—అంటే ప్రజలలో అపరిగ్రహమున్నది. రక్తం శరీరములోని ఏదేని ఒకే భాగంలో పరిగ్రహించబడితే— అంటే కాలులో రక్త మంతా సంగ్రహించ బడితే, దాన్ని వాచిన కాలు అంటాము. ఈ విధంగా పరి గ్రహములో శక్తి ఉండదు—పైగా అందులో దుర్బలత్వ ముండే అవకాశమున్నది. అపరిగ్రహమనే దానికి, సమంగా పంచబడి ఉండటమనే గొప్ప అర్థమున్నది. అపరిగ్రహ మంటే అత్యంత పరిగ్రహమని. 'అ' అంటే 'అత్యంత' అని అర్థము. అపరిగ్రహ ప్రణాళికలో దమ్మిడీ కూడా నిలువ ఉండదు. సర్వస్వం ఉత్ప త్తిలో నిమగ్నమై ఉంటుంది.

## చింతాముక్తి — ఉత్పాదన వృద్ధి

ఉదాహరణకు నేను ఒక పుస్తకం చదివి పెట్టెలో పెట్టు కున్నాననుకోండి. పదేళ్ళ వరకు అది నా పెట్టెలో పడి ఉండటం వలన ఏం లాభం? ఈ విధమైన పరిగ్రహము వలన ప్రపంచానికి గాని నాకు గాని ఏమైనా లాభం ఉందా? నేనా పుస్తకం చదువుకోగానే, వెంటనే దాన్ని రెండో వ్యక్తికి అం దించాలి. అతడు చదువుకోగానే అది మూడో వ్యక్తి వద్దకు చేరాలి. ఈ విధంగా తిరుగుతూ ఆ పుస్తకం చినిగిపోయినా, అందులో ఉన్న జ్ఞానం దూరదూరాలకు వ్యాపిస్తుంది. పుస్తకం విముక్తి పొందుతుంది. అదేవిధంగా మన వద్ద ఉన్న సంపత్తి సుదూరపు వ్యక్తుల కొరకు వినియోగ పడ్డప్పుడే దాని ఉపయోగమూ జరుగుతుంది. మనం విముక్తులమూ అవు తాము. ఈ విధంగా అపరిగ్రహములో చింతాముక్తియే కాక, ఉత్పత్తిని పెంచే మహత్తరమైన మరొక శక్తికూడా ఉన్నది. అది పరిగ్రహాన్ని ఇంటింటికీ పంచుట వలన — సామ్యావస్థ,

ప్రేమభావం, నిర్వైరత, ద్వేషరాహిత్యం కలుగుతాయి. పూర్వీకులు అపరిగ్రహము ద్వారా చింతాముక్తి, ద్వేషరాహిత్యమే కోరుతూ వుండిరి. అది మనమూ కోరుతాం. కాని, దాని ద్వారా ఉత్పత్తిని పెంచే శక్తిలో కూడా అది సహాయ పడుతుంది. సంపత్తిదానం ద్వారా, అపరిగ్రహపు ఈ శక్తిని మేము ప్రత్యక్షంగా చూపించదలచినాము.

*   *   *   *   *

"సాధారణంగా, గాంధీజీ, వినోబాలాంటి సన్యాసుల కొరకే అపరిగ్రహము" అని భావించ బడుతూంది; సామాన్యుల కోసం పరిగ్రహమేనట! అందుకనే ప్రజలు సన్యాసుల్ని గౌరవించినా అక్కడక్కడ వారిని తమ ఇండ్లలోకికూడా రానివ్వరు. సన్యాసాన్ని అంతిమ ఆదర్శంగాఒప్పుకొంటూనే గృహస్థాశ్రమంలో పరిగ్రహాన్నే నడుపుకుంటారు. ధర్మ సిద్ధాంతాల్ని ఈ విధంగా ఖండించటం వలన వాటిద్వారా పరిమితమైన లాభమే కలుగుతుంది. ఫలిత మేమిటంటే లోభితో పోటీ పడ్డప్పుడు నిర్లోభికూడా లోభి అయిపోతాడు. నేడు ప్రపంచంలో లోభత్వం — పరిగ్రహం రాజ్యం చేస్తున్నాయి. పరిగ్రహానికి చుట్టూ అది తప్పుగా భావించబడకుండా చట్టాలూ, నియమాలూ నిలబెట్టబడ్డాయి. దొంగతనాన్ని మనం తప్పంటున్నాం. కాని సంగ్రహించి, దొంగతనానికి ప్రేరణ కలిగించే వారి చర్యను తప్పుగా భావించటంలేదు. ఉపనిషత్తుల కథలో "నా రాజ్యంలో దొంగా లేడు, లోభీ లేడు" అని రాజు అంటాడు. ఎందుకంటే లోభులే దొంగల్ని పుట్టిస్తారు. దొంగల్నేమో మనం జైళ్ళకు పంపిస్తున్నాం కాని వారిని పుట్టించే వారిని వదలుతున్నాం. వారు మంచివారుగా చెలామణి అవుతూ గద్దెల మీద తిష్ఠ వేసుకుంటున్నారు. ఇది ఎక్కడి న్యాయం? 'గీత'

కూడా వీరిని దొంగలనే అన్నది. కాని మనం గీతను కూడా ఇవాళ సన్యాసుల పుస్తకమని చెప్పి, దాన్నుంచి కూడా సన్యాసం స్వీకరించాం.

## అస్తేయము: అపరిగ్రహము

అస్తేయము, అపరిగ్రహము, ఈ రెంటి కలయికవలన అర్థశుచిత్వము పూర్ణమగును. అది లేనిచో వ్యక్తి లేక సమాజపు జీవన ధర్మప్రతిష్ఠ నిలువదు.

అర్థప్రాప్తి నియమము అస్తేయమువలన కలుగును. అది ఎంతవరకు జరగవలెననే అంశము అపరిగ్రహమువలన తేటపడ గలదు. అస్తేయ సూత్రమిట్టిది. శరీరమును నిర్వహించుట ముఖ్యముగా శరీర శ్రమచేత జరుగవలెను. అనగా ఉత్పాదక పరిశ్రమ ద్వారా కావలెను. శరీరశ్రమ చేయక మనం భుజించినట్లయితే, ఒక అపాయము సంభవించును.

ప్రపంచంలో ప్రస్తుతం వుండే అనేక దురవస్థలు, దుఃఖము, పాపము చాలవరకు, శరీరశ్రమ చేయక తప్పించుకునే పద్ధతివల్లనే కలుగుతున్నవి. ఇట్టి పద్ధతిని అవలంబించువాడు గుప్తరూపమున లేక ప్రత్యక్షముగా చౌర్యం చేస్తున్నాడు. ఇందువలన, అస్తేయ వ్రతము శరీరశ్రమద్వారా సంపత్తి నిర్మాణము చేయవలెనని గట్టిగా పలుకుతున్నది.

## ఆవాహనము

ఏ విధంగానైతే వర్షం వచ్చింతర్వాత దూరదూరంనుంచి నీరు ప్రవహిస్తూ — ఎక్కడ వంతవుంటే అక్కడ వేగంగా పరుగెత్తుతూ సముద్రరూపంలో ఉన్న లోతును పూడ్చడానికి, నింపడానికి ప్రవహిస్తుందో— అదేవిధంగా ప్రతి ఇంటినుంచీ, ప్రతి వ్యక్తి

నుంచి ఎంతో కొంత సంపత్తి దానం ప్రవహించడం ప్రారంభం కావాలనీ, అందరికన్నా క్రింద ఉన్నవారికి, అందరికన్నా దుఃఖపులైనవారికి అది ఉపయోగ పడాలనీ మా కోరిక.

*　　　　*　　　　*

స్వామిత్వపు పునాదులు కదలి పోతున్నాయి. అందు కని స్వామిత్వాన్ని రక్షించుకోడానికి, ధర్మశాస్త్రం నుంచి అర్థ శాస్త్రం, కామశాస్త్రం వరకు ఉపయోగించు కొంటున్నారు. నేడు ఈ సాంఘిక వ్యవస్థను రక్షించుట కొరకు నేటి శాసన వ్యవస్థను ఆధారం చేసుకుంటున్నారు. అయితే ఇది కొత్త విషయమేమీ కాదు. దీనికోసం వేదాల ఆధారాన్ని కూడా తీసుకొనవచ్చు. కాని ఈ పరిస్థితుల్లో స్వామిత్వాన్ని కొనసాగ నివ్వటం అధర్మమని మేము గట్టిగా విశ్వసిస్తున్నాము. దాన్ని ప్రజలు కొట్టివలసి యే యున్నది. ఈశ్వరునిపై భారంవేసి, ఈ పనిలో శ్రద్ధాళువులై సోదరీ సోదరు లందరూ ఈ కార్యక్ర మంలో నిమగ్నులౌతారనే విశ్వాసం నాకున్నది.

—వినోబా

మూడవ భాగము

# సంపత్తి దానము

శ్రీకృష్ణదాస్ జాజూ

## ప్రారంభదశ

నేడు దేశమంతటా భూదానయజ్ఞం సంగతి తెలిసి పోయింది. కార్యకర్తలు భూస్వాములవద్ద భూదానము అడగటానికి వెళ్లినపుడు, భూస్వాములు వారితో ఈ విధంగా చెప్పుతున్నారు. మీరు 'మావద్గర భూములున్నవని అడుగుతున్నారు. కాని దేశంలో ధనంగల వారున్నారు, కోట్లసంపత్తి వారివద్ద పడివున్నది. అందులో భాగం ఎందు కడగరు?' నిజమునకు, భూదాన యజ్ఞగర్భంలో సంపత్తిదాన యజ్ఞము వుండనే వున్నది, ఇంతవరకు దానికి స్పష్టమైన రూపము రాలేదు. అయితే ఈ రెండు యజ్ఞములలో భూదాన యజ్ఞంతో కార్యం ఎందుకని ఆరంభమైనది అనే ప్రశ్నకు శ్రీ వినోబాజీ అనేక పర్యాయములు సమాధానము చెప్పినారు. అంతేగాక భూమి సమస్య కొంత విశిష్టమైనది, విలక్షణమైనది అని ప్రతి ఒక్కరు తెలుసుకో గలరు. ఈశ్వరుడు భూమినీ మానవునికూడా సృష్టించెను. భూమి మనుష్యుని జీవనాధారముగా వున్నది. కాని వ్యక్తి శరీరశ్రమద్వారా ఆ భూమిలో పంట పండించకపోతే, అతనికి బ్రతుకుతెరువులేదు. అందువల్ల ఈశ్వర సంకేత మేట్టిదనగా— మనుష్యుడు భూమి మీద శ్రమించి తన జీవనమును నడిపించు కోవలెను; శరీరశ్రమకు తగిన పూర్తి ఫలమును అతడు అనుభవించగలడు. కాని మనుష్యుని ఒకానొక తప్పిదంచేత, ఎవరైతే భూమిమీద కష్టం

చేయునో వారికి చాలా ఎక్కువభూమి వుండడం, ఎవరైతే స్వయంగా భూమి దున్నుటకు ఇష్టపడుతారో, వారిలో చాల మందికి తమ పొట్ట నింపుకునేందుకైనా కావలసిన స్వంతభూమి వుండకపోవడం సంభవించినది. దీని ఫలితంగా స్వంత భూమి లేని వ్యవసాయకులు తమ శ్రమ ఫలితంలో ఒక పెద్ద భాగాన్ని భూమి పట్టేదారునికి ఇయ్యవలసి వస్తున్నది. అందువల్ల భూమి లేనివారికి భూమి నిచ్చే ప్రశ్న ముందు పరిష్కరించ బూనుట వుచితమని భావించబడినది. అంతేగాక ఒకే పర్యాయము అనేక పనులు చేయబూనితే యేపనీ పూర్తిగాదు. మనుష్యుని శక్తి పరిమితము. ఒక పనిని ఆరంభించి, దాని వెంట బడితే అది సఫలం కాగలదు. ఇప్పుడు చాలవరకు భూదానయజ్ఞం కొన సాగింది. అది సఫలం అవుతుందా కాదా అనే సందేహం లేదు. కనుక స్వాభావికంగా సంపత్తిదానము ముచ్చట మళ్ళీ వస్తున్నది. ఐనప్పటికీ, శ్రీవినోబాజీ యీ వుద్యమాన్ని యిప్పుడే విశేష వ్యాపకం చేయదలచుకోలేదు. వ్యక్తి స్థాయిలో దీనిని నడిపించ వలెనని కార్యకర్తలను ఆదేశించిరి. అయినా ఒక విషయము స్పష్టము. సమయంజూచి సంపత్తిదాన యజ్ఞ ధర్మచక్రము గూడ భూదాన యజ్ఞమువలె వేగంగా పరుగిడ గలదు. అందువల్ల, శ్రీ వినోబాజీ దీని విషయమై ప్రవచించిన వాక్యములను శ్రద్ధతో మనం అధ్యయనం చేయ వలసియున్నది. వ్యక్తిగత రూపంలో సంపత్తిదాన మదుగుట కైననూ, అట్టి అధ్యయనము అవసరమేగదా! శ్రీ వినోబాజీ ప్రవచనములలో నుంచి కొన్ని అంశములు చివరి భాగమున ఉల్లేఖితమైనవి. నేను యెప్పుడు భూదానయజ్ఞ ప్రచారమునకు బయలుదేరితినో అప్పుడు నాలో సంపత్తి దానమును గురించి కొన్ని భావములు వుత్పన్నమైనవి. వాటిని సంక్షేపముగా

యిక్కడ తెలియ జేయవలెనని భావించితిని. విశేషించి ధనికు లకు నేను విన్నవించదలచినాను. బహుశా యే పరంపర అనుస రించబడుతున్నదో దానినే సమగ్రముగా మనం భావించడంకద్దు. దాని మూలమును వెదకినట్లయితే మన వివేకముచేత యింత వరకు మాన్యత పొందిన అంశము యెంత గొప్ప తప్పిద మైనదో మనకు తెలియగలదు. ధనికులు ఆలోచనా పరులై విచక్షణ జేయుట కొరకు కొన్ని అంశములను వారి యెదుట యిందు మూలముగా నివేదించెదను. ద్రవ్యమును సంపాదిం చుట, సంగ్రహించుట, దానిని వుపయోగించుట మున్నగు విష యములందు యిదివరకటినుంచీ మనం కలిగిఉన్న అభిప్రాయ ములు సరియైనవా, కావా అనే అంశముపై ధనికులు స్వయంగా ఆలోచన చేయగలరని ఆశిస్తున్నాను. ఇట్టి విధమైన మనోమథనం చేతనే మనుష్యుడు ఆధ్యాత్మికముగా ముందుకు పోగలుగుతున్నాడు,

## 'దానము' - సంపత్తి స్వామ్యము

ఈ యజ్ఞములలో ప్రయోగింపబడిన 'దాన' శబ్దమునకు గల అర్థమును మనం గ్రహించవలెను. దయాధర్మాభిముఖంగా ఒక వ్యక్తి మరొక వ్యక్తికి యివ్వడం, తన పారలౌకిక కల్యాణం కొరకై కొంత ఖర్చుచేయడం ఇదియే 'దాన' శబ్దమునకు అర్థ మని మనం భావిస్తూ వుంటిమి. శ్రీ వినోబాజీ కథనం ప్రకారం దానమనగా సమవిభజన, సమ్యక్ విభాగం, ఉచితమైన బట్వాడా. ఈ అర్థములో 'దాన' శబ్దమును వినోబాజీ ప్రయోగం చేస్తు న్నారు. పూర్వపు లెక్కప్రకారం దాన మియ్యబడిన వస్తువు నకు దాత యజమాని. దానిని తనవద్ద వుంచుకనే అధికారం గలవాడై వుండెను. కాని, భూదాన యజ్ఞములో తన అవ

సరుకంటే అధికమైన భూమి తనదిగాదని భావించవలెను. ఇంతకులోగా ఆ అధికమైన భూమి యే కారణములచేత తన వద్దకు వచ్చినప్పటికి అది తప్పిదమైనది. దానిని దురుస్తు చేయ వలసిన సమయం వచ్చినదని భావించవలెను. ఇదే విధముగా దానము పొందినవాడు తన దారిద్ర్యము, దీనత్వము కారణ ముగా తనకా భూమిపై హక్కు లేకుండినందువల్ల దాత కృప వలన తన కది లభించినదని భావించడు. తనకు భూమిపై అధి కారము గలదని అతడు గ్రహింపగలడు.

## అధికారములో అనధికారమా ? అదెట్లు ?

ప్రస్తుతము సంపత్తినిగూర్చి ప్రబలిన అభిప్రాయమును చూడగా, ఉపరి కథనము విచిత్రముగా కన్పిస్తున్నది. సంపత్తి గలవాడు యిట్లను కొనును. "నేను శారీరకంగా లేక బుద్ధిచేత కష్టపడి సంపత్తిని సంపాదించితిని, యెవరివద్దను దొంగిలలేదు; చట్టబద్ధమైన పద్ధతులద్వారానే ధనమును సేకరించితిని. దానిని అనుభవించుటకు నాకు అధికార మున్నది. ఈ నా అధికారమును చట్టము, సమాజము రెండూ అంగీకరించినవి. ఇక యిప్పుడు అట్టి నా అధికారము ఆ సంపత్తిమీద లేదంటే అది కుదిరేమాట గాదు. ఇదే విధముగా భూమిని లేక సంపత్తిని దానముగా పొందినవాడు దానిని సంపాదించుటకు పరిశ్రమ చేయలేదు. చట్టంద్వారాకూడా అతనికి దానియందు యెట్టి అధికారము లేదు. ఇట్టి స్థితిలో వానికి హక్కున్నది అనేమాట చెల్లుబడి అయ్యే దెట్లు ? సంపాదన లేనిది యే వస్తువుపై యెవరికి హక్కు వుండే దెట్లు ? చట్టంగూడా అట్టి హక్కును సమర్థించదుగదా !"

## చట్టము, సాంప్రదాయము రెంటినీ మించినది న్యాయము

మనము ఈ సవాలుకు జవాబు చెప్పుటకు ప్రయత్నించె దము. చట్టము మరియు సమాజముయొక్క మాన్యతను లక్ష్యము చేయవలసినదే. కాని, అవి రెండూగాక న్యాయము అనే వస్తువున్నదని మరువకూడదు. అది అన్నిటినీ మించినది. దాని అధికారమును ఎవ్వరు చెరుపజాలరు. కారణ మేమనగా, దానిమూలము వెలుపలగాక, అంతరంగమందున, ఆత్మయందు, మనుష్యుని సదసద్వివేక చతురతయందు వుంటున్నది. ఈ సమ యమున ఒక సంగతిని మనసుకు తెచ్చుకోవలయును. అదేమనగా ఒకానొక సమయమున చట్టము, సమాజము దేనిని విశేషించి అంగీకరించునో, అదియే ఎప్పటికీ సరిగా వుండునని భావించ రాదు. చట్టము అనేక సమయములందు అమలులోవున్న పరం పరను అనుసరించి పోతూ వుంటుంది. సమాజముయొక్క మాన్యత చాలావరకు అదివరకే రూఢిగావున్న అంశములకే వర్తిస్తుంది. సమాజము లేక చట్టము అంగీకరించిన సంగతి సదా న్యాయ సమ్మతమని అంగీకరించుటకు వీలులేదు. దీర్ఘకాలపు చరిత్రను పరిశీలించినయెడల ఇట్లు స్పష్టము కాగలదు: ఒక జమానాలో మాన్యత పొందిన అంశములు సమయమురాగానే ఆమూలంగా పరివర్తన పొందినవి. మాన్యతలో మార్పురాగానే, చట్టముగూడా మారింది. మాన్యత వుండినన్నాళ్ళు, అది సరియా, కాదా అనే సంశయము ఎవరి మనస్సులోనూ కలుగలేదు. ఒక వేళ కొందరి కెవరికైనా కలిగివుండినా, దాని ప్రభావము ఆనాటి అభిప్రాయమును అంటలేదు. సమయము రాగానే వివేకము జాగృతి పొందినది. మానవత్వం దృష్ట్యా, మాన్యతలో ప్రస్తుతం వున్న అంశము ఘోరమైన అన్యాయముతో నిండి

వున్నదని తెలిసినది. ఆఖరుకు పరివర్తనము జరగనే జరిగినది. మాన్యత తొలిగినపిదప, రాజ్యముగూడా చట్టములో మార్పు చేయక తప్పదు. రాజ్యము ఆ విధంగా చేయకపోతే అది తలక్రిం దులై పోతుంది. వివేకము జాగృతి పొందినపిమ్మట, తప్పు తెలిసిన మీదట, మాన్యత ఎంత పురాతనమై, ఎంత వ్యాపకమై వున్న ప్పటికీ దానిని మార్పుచేయకతప్పదు. దీని స్పష్టీకరణ కొరకు ఒకటి రెండు ఉదాహరణలు తీసుకుందాం.

బానిస వ్యవస్థ కొన్ని వేల సంవత్సరములవరకు ప్రపంచ మంతటా నడుస్తూ వచ్చినది. ఒక సుప్రసిద్ధ తత్వవేత్త ఆ వ్యవ స్థను సమర్థించెను. బానిసలలో కొందరు తమ హితంకొరకే యీ వ్యవస్థ కలిగిందని భావించిరికూడాను. కాని, ఒకనాటికి మనుష్యుని వివేకము జాగృత మైనది. తనవంటి మాంసం, ఎముకలు, సుఖ-దుఃఖములుకలవానిని తాను బలవంతుడు లేక ధనవంతుడైనంతమాత్రాన బానిసగా వుపయోగించుకొనుట ధర్మమా అనే ప్రశ్న వుదయించినది. దీనిని పరిష్కరించుకొను టకై అంతర్యుద్ధము సంభవించినది. ఆఖరున బానిసత్వము అంత రించినది. ఇదేవిధంగా రాజరికం అనే వ్యవస్థకూడా చాలా కాలం వుండి యెగిరిపోయింది. ప్రపంచమంతటా కొన్ని వేల సంవత్సర ములు రాజుల, పాదుషాల రాజ్యం నడిచింది. పృథివీపతియే విష్ణువు అనే వరకు మన భారతదేశంలో ఆ వ్యవస్థ మాన్యత పొందినది. ఆఖరున కోట్లప్రజను ఒక వ్యక్తి తన ఆధీనంలో వుంచు కొనే అధికారమును గలిగివున్నాడా అనే ప్రశ్న వుదయించినది. దీనిని పరిష్కరించుటకు అనేక ఘోరయుద్ధములు జరిగినవి. యుగములు కొన్ని దీనికి సంబంధించిన జగడములలోనే గడిచి నవి. అసంఖ్యాకులైన ప్రజలు యాతనలు భరించవలసి వచ్చినది. కడపట రాజరికం నశించినది. రాజ్యచక్రం ప్రజల హస్తగత

మైనది. ఇప్పటికీ అక్కడక్కడా కొందరు తమకు ప్రజలివ్వని అధికారములను చలాయిస్తూ వుంటారు. కాని దీనిని అందరు అయిష్టంగానే చూస్తున్నారు. ఇది ఆఖరుకు ఎంతోకాలం వుండదని నిస్సంశయంగా మనం భావించవచ్చును. ఈ విధమైన ఉదాహరణము లనేకముల ద్వారా, ఎప్పటి కప్పుడు లోకంలో కలుగుతూవచ్చిన పరివర్తనను రుజువు చేయవచ్చును. ఆ పరివర్తనల ఫలితంగా వేల సంవత్సరాలుగా అతి గౌరవ పూర్వకంగా నడిచిన పద్ధతులు విసర్జింపబడినవి. సంపత్తి యాజమాన్యమునందు కూడా ఇటువంటి సంగతే వున్నది.

## సంపత్తి ఎట్లు కలుగుచున్నది?

ఇక్కడ మనం కొంచెం విచారించవలసి యున్నది యీ సంపత్తి ఏవిధంగా కలుగుతున్నదీ అనే విషయం. రూపాయలు, నోట్లు, వెండి, బంగారములు సంపత్తిగా భావించబడుట తప్పు. సంపత్తిని లెక్కించుటకు ఇవి సాధనములు మాత్రమే. మనుష్యుని ఉపయోగార్థం ఏదో ఒక రూపంలో తయారయ్యే వస్తువులే సంపత్తి. ఆ వస్తువులలో కొన్ని యిటువంటివిగదా, అవి లేకుంటే మనిషి జీవించలేడు అనేక వస్తువు లితరములైనవి. మనుష్యుని సుఖజీవన సాధనములుగా వుంటున్నవి. విశ్రాంతికి ఆధారములుగా వున్నవి. అన్నవస్త్రములు, ఇల్లు యివి మనుష్యుని నిత్యావసరములు. ఇవిలేక జీవనము దుర్లభము. ఇతరమైన వస్తుసంచయం చాలా వున్నది. అది లేకున్నా మనిషి జీవించి వుండగలడు.

ఐతే సంపత్తి రూపకమైన వస్తువులన్నీ యే విధంగా తయారవుతున్నవి? అవి తమంతట తాము భువిలోకి రాలేదు. ఆకాశంనుంచి వ్రాలి పడలేదు. పుట్టుకతోనే యెవడూ వీటిని వెంట తీసుకొని రాడు. అంతేగాక మనిషి జన్మించిన తదుపరి

అవసరములు యేర్పడుచున్నవి. వాటిని తీర్చుకొనుటకు మనిషి సదా చాలా అవస్థ పడవలసి వస్తున్నది. సృష్టిలో గల నానావిధ ద్రవ్యములను సేకరించి వాటితో మనిషి శారీరకంగా కష్టపడు తాడు. ఆ విధంగా ప్రయోజనార్థం అనేక వస్తువులు కలుగు తున్నవి. అందుచేత సంపత్తికి ముఖ్యసాధనములు రెండు. సృష్టి లోని ద్రవ్యము, శరీర శ్రమ. యంత్రమువల్ల కొన్ని వస్తువులు తయారవుతున్నమాట నిజమే. ఐతే ఆ యంత్రం శరీర శ్రమ చేత నిర్మితమైనది, యంత్రమును నడుపుటలోగూడ ప్రత్యక్ష ముగా లేక పరోక్షముగా శరీర శ్రమ అవసరం వుండనే వున్నది. కేవలం బుద్ధిబలంచేత ప్రత్యక్షంగా వుపయోగార్థం వస్తువు లేవీ తయారు గావు. అందువల్ల శరీర శ్రమ లేనిది సంపత్తి రాదు.

ఐతే సంపత్తి యాజమాన్యమందు శరీర శ్రమ చేసేవారి స్థానం యెట్టిది? ఎవరు ప్రత్యక్షంగా శరీర శ్రమ చేస్తున్నారో వారు పేదరికంలో, కష్టంలో తమ జీవితములు గడుపు తున్నారు. వారిచే నిర్మాణమైన సంపత్తి కొలదిమందియైన యితరుల చేతుల్లో ప్రోగై వున్నది. శ్రమజీవులు చేసిన వస్తువులు వ్యాపారస్తులు, తదితరుల చేతుల్లోకి వెళ్ళిపోతున్నవి. వస్తువు లను యిచ్చి పుచ్చుకోవడములలో కొందరు ధనవంతు లవు తున్నారు. సంవత్సరమంతా కష్టపడి రైతు అన్నం సృష్టిస్తాడు. కాని, సాధారణంగా అతని అవసరములు కూడ అందులోనుంచి పూర్తిగావు. ఐతే రైతు పండించిన ఆ ధాన్యమే వ్యాపారస్థుల వద్దకు వెళ్ళి, వారిని ధనవంతులుగా జేస్తుంది. ఇక కూలీల సంగతి చూదాం. ఏ కూలీల సాయంలేకుంటే కార్ఖానా నడ వడం అసంభవమో వారికి ఆ కార్ఖానా వలన విశేషంగా ప్రాప్తించే ఆశయేలేదు. కాని, కార్మికులు యోగ్యతను పొందిన పిమ్మట ధనవంతులు విద్యాధికుల సాయంలేకనే కార్ఖానాలు

నడుపుకొనగలరు. ఐనప్పటికీ కార్మికులు పొందే వేతనముల కంటె యెన్నో రెట్లు ఆదాయమును ధనికులు, వ్యవస్థాపకులు పొందుతున్నారు. సంపత్తిని సృష్టించేది కార్మికులు. కాని, కష్టం యెవ్వరు చేయరో వారు ధనమును ప్రోగుచేస్తారు. అంతే గాక కార్మికులను నీచమైన దృష్టితో చూస్తారు. ఈ విధంగా సంపత్తి కొలదిమంది చేతులలో చేరి వుంటున్నది. ఇట్టి వారి సంఖ్య నూటిలో అయిదు లేక పది వుండవచ్చును. శరీర శ్రమ చేసేవారి సంఖ్య నూటికి తొంభై లేక తొంభై అయిదు వుండవచ్చును.

ఈ ధనికుల సంపత్తికి గల మూల కారణమును పరి శీలించి నట్లయితే అది శ్రామికుల వద్దనే లభ్యం కాగలదు. ధని కుల వద్ద వున్న సొమ్ము శ్రామికుడు లేక పేదవాడు తన జేబులోనుంచి తీసి యిచ్చినట్లుగానే మనం భావించ దగును. పేదలకు తమ శ్రమ ఫలితం పూర్తిగా ముట్టదు; లేదా బీదలు మరింత బీదలై ధనికుల సంపత్తిని పెంచుతూ వుంటారు. ఆ సంపత్తిపై ధనికుల యాజమాన్యం అంగీకరించబడినది. చట్టము, సమాజము యీ స్థితిని అంగీకరించి, గౌరవించినప్పటికీ యిది న్యాయసమ్మతమైన పరిస్థితి యని మనం భావించగలమా?

## శ్రమజీవి, బుద్ధిజీవి — ఇద్దరిలో ఉత్తము లెవరు?

మన జీవనమును నడుపుకొనుటకు లేక ధనమును ఆర్జిం చుటకు అనేక విధములైన పద్ధతులను మనం అవలంబిస్తు న్నాము. వీటిని స్థూలంగా ద్వివిధంగా విభజింపగలము. శరీర శ్రమ అవసరమైనపద్ధతి యిందులో ఒకటి. బుద్ధిబలంచేత నడిపించే పద్ధతి రెండవది. మొదటి పద్ధతిని శ్రమజీవి విధానముగా మనం పేర్కొనెదము. రెండవదానిని బుద్ధిజీవి విధానమని పేర్కొనె

దము. రాజ్యతంత్రం నడిపే మంత్రి మొదలు చప్రాసీవరకు గల పదవులు గలవారు, న్యాయాధీశులు, వకీళ్ళు, డాక్టర్లు, అధ్యాపకులు, వ్యాపారులు తమ పుదర పోషణ, సంపాదన కేవలం బుద్ధి చేత పనిచేసి చేసుకుంటున్నారు. రెండవ పద్ధతిలో శరీర శ్రమ చేత జీవించేవారు. రైతు, కూలి, కమ్మరి, కుమ్మరి, చమార్, భంగీ యిత్యాది వర్గములవారు అట్టివారే. సమాజము నడుపవలెనంటే యీ ద్వివిధమైన వ్యవహారము అవసరమే. కాని, సామాజిక దృష్టిలో యీ రెంటి మూల్యములు పరస్పరం చాలా భేదం కలిగివుంటున్నవి. నిజమే, ఈ మాటకూడా వింటున్నాం- ఏమనగా- శరీర శ్రమవలెనే బుద్ధిచేత శ్రమ చేయబడుచున్నది. రెండవ రకమైన శ్రమ మొదటి దానికంటె మహాత్వం గలది కాని, లోతుగా వెళ్ళి యీ విషయమును పరిశీలించి నట్లయితే సమాజ నిర్వహణ దృష్టిలో నిజస్థితి యిందుకు భిన్నంగా వున్నదని తెలియగలదు.

శ్రమజీవులు తమ తమ వృత్తులు మాని గబుక్కున కూలబడితే యేమవునో ఒకసారి వూహించండి. మనుష్యుని ప్రాథమిక అవసరములకు సైతం వస్తువు లుండవు. సమాజము బ్రతికి వుండదు. బుద్ధిజీవులు తమ పనులు మానినట్లయితే సమాజములో కొంత అవ్యవస్థ తప్పక సంభవమే. కాని, సమాజము మరణించదు. బుద్ధిజీవుల జీవనంకూడా శ్రమజీవుల వృత్తులమీద ఆధారపడియున్నది. సమాజము నిల్చివుండుటకు శ్రమజీవుల యొక్క మహాత్వము యెంతటిదో యికనైనా వూహించండి. నిజస్థితి యిట్లున్నప్పటికీ దైవప్వాలాస మెట్టిదో గమనించితిరా? శ్రమజీవుల ఆదాయము స్వల్పము. బిడ్డల చదువు, జబ్బు చేస్తే మందు, మనసుకు సంతోషం కలిగే వాతావరణం యిత్యాది

విషయములు శ్రమజీవికి చాలా దూరమైన సంగతులు. ఇందుకు భిన్నంగా బుద్ధిజీవుల వేతనములు లేక ఆదాయములు చాల యెక్కువ. సమాజం వారిని గొప్పగా ఆదరిస్తున్నది. వారికి సుఖం, భోగం కలిగే అవకాశాలు హెచ్చుగా లభించగలవు. ఈ సమాజంలో, యిట్టి వ్యవస్థలో దోషం కలదని యెవరికీ తోచడం లేదు. చట్టంకూడా దీనిని అంగీకరిస్తున్నది. ఐనప్పటికీ యిది న్యాయమేనా అనేప్రశ్న ఉదయిస్తున్నది. ఇక మన మీ ముఖ్య ప్రశ్నను గురించి చర్చిద్దాము.

## బుద్ధిజీవికి అధికంగా ధనం సంపాదించే హక్కున్నదా?

ధన సంచయము, అధిక ధనార్జనల సమర్థన కొరకై జరిగే ముచ్చటలు కొన్ని వున్నవి. వాటినిగురించి కూడా ఆలోచించ వలెను. దేశంలో - పరదేశంలో వున్నత విద్యను అభ్యసించి, ప్రత్యేక విషయంలో నిపుణుడైవచ్చి, మాటవరుసకు డాక్టరై వచ్చి నేర్పుతో వైద్యం చేస్తూవుంటాడు. తనకుగల కళద్వారా తాను అత్యధికంగా పైసలు సంపాదించుకునే హక్కును కలిగి వున్నానని అతడంటాడు. సమాజం దానిని ఆమోదిస్తుంది. ఆ వైద్యుడు తన యిష్టంవచ్చినంత ఫీజు యివ్వమని అడుగు తాడు. ఇంత ఫీజు యెందుకని అడుగుటకు యెవరైనా సిద్ధ మైతే 'నేను సంవత్సరముల తరబడి కఠోరమైన పరిశ్రమచేసి, చాలా ధనవ్యయంచేసి యీ విద్యను సంపాదించితిని గనక అందుకు తగినట్లే నాకు తిరిగి పైసలు రావలెను' అని అంటాడు. రోగి పేదవాడయినట్లయితే అతడికి కొంచెం తక్కువఫీజు చార్జి చేయబడుతుంది. ఐనా, ఆ తక్కువ చేయబడేందుకు అతడికి హక్కున్నదని యెవరూ అనరు. అట్లే న్యాయశాస్త్రము, ఇంజనీరింగ్ మొదలగు విద్యలందు నిష్ణాతులైనవారు (వైద్యుని

వలెనే) వాదించెదరు. పేరుగల రచయితలు, కవులు, చిత్ర కారులు యిత్యాది కళావిదులది కూడా యిదే కథ. వ్యాపారి, ఉద్యోగి, వ్యవస్థాపకుడు అల్లే వాదించెదరు.

చౌకలో చౌకగా ఖరీదుచేసి, గిరాకిలో గిరాకిగా విక్రయం చేయవలసిందని వ్యాపారి తదితర ఉద్యోగస్థుల (వృత్తులు చేసే వారి) అర్థశాస్త్ర నియమము. ఆదాయమునకు మితిలేదు. కార్ఖానాలో శరీర శ్రమచేసే కార్మికులకు యాభై, నూరు రూపాయల వేతనం నెలకు దొరకడం మహాకష్టం. కాని, దాని వ్యవస్థాపకులకు, పెట్టుబడిదారులకు వేలకొలది రూపాయలు లభించడం ఆక్షేపణీయంగా లెక్కకు రావడంలేదు. అమలులో వున్న ఆలోచనాపద్ధతి ప్రకారం బుద్ధిజీవులకు మితిలేని ధనం ఆర్జించే హక్కున్నది. బుద్ధిజీవి చాలా ప్రయాసపడి కళను అభ్య సించెను. కనుక అతడికి అట్టి హక్కున్నదని అంగీకరించబడినది. ఎవరు అట్లు అభ్యసింపలేదో వారు యెక్కువ ఆర్జించలేరు. అప్పు డప్పుడు ఆకలిబాధను అనుభవించుటకూడా సంభవమే. అందుకు యితరులపై దోషమును ఆరోపణచేయుట యెందులకు? ఐతే, పేదవారిలో కూడా బుద్ధిగలవారు వుండవచ్చును. అవకాశం లభిస్తే వారు కూడా అట్టి శక్తిని పొందగలరు అనే మాట మనం సాధారణంగా అనుకోము.

ఐతే యిట్టి శక్తిగలవారికి మితిలేని ధనం సంపాదించే హక్కు వున్నదా అని ప్రస్తుతం మనం పరిశీలన చేయవలెను. ఇది వినండి. ఒక పిల్లవానిని చాలా చిన్నతనంనుంచే ఏకాంత ములో పెంచినామనుకోండి. ప్రజలతో వానికి సంబంధం కల్పించ లేదనుకోండి. వాని రక్షణకు, పోషణకు ఏకాంతములోనే ఏర్పాటు జరిగిందనుకోండి. అల్లే ఆ బాలుడు పెరిగితే, పరి ణామ దశ ఎలా వుంటుంది? వానికి మాటలు రావు, తన

కడుపులోని విషయం ఒకరికి తెలియజేయలేడు, ఇతరుల మాటలు తాను తెలుసుకోలేడు. మామూలు వ్యవహారంకూడా చేయజాలడు. వ్యవహారం చేయగలిగి సమాజంలో వుండడం అంటే సమాజపు కృపవలననే యెవడైనా మనిషి కాగలడు. బాలుడు అభ్యసించే పాఠశాల మొదలు దేశ-విదేశములందలి మహా విద్యాలయములలో తాను గొప్ప విద్యలన్నీ నేర్వగలిగి వున్నాడే, అట్టి సంస్థలన్నీ వాని స్వంత సంస్థలా ? కావే! ప్రజలపై పన్నులు వేసి, వసూలుచేసిన పైసలతో సర్కారువారు ఆ సంస్థలను నడుపుతున్నారు. లేదా దానపరులైన వారియొక్క కృపద్వారా అవి నడుస్తున్నవి. చదువుటకు యిచ్చే ఫీజు ఆ సంస్థల ఖర్చుజాబితాలో లెక్కపెట్టవలసిన అంశమేకాదు. అంతేగాక మహాతపస్వులు వేలకొలది సంవత్సరాలుగా సాగించి తెల్పుతూవచ్చిన సంగతులన్నీ సేకరించిన జ్ఞానకణము లన్నీ చేర్చితేనే ఆ సంస్థలో నేర్పు, విద్య, కళలు వుత్పన్నమైనవి. అట్టి విద్యాలయములవల్ల వ్యాపారులు, యితర వృత్తులవారు విద్యను పొందెదరు. ఆ విద్యాభ్యాసం చేసేటప్పుడు సాటి విద్యార్థుల సహవాసంద్వారా అశేషంగా జ్ఞాన సంచయం చేసెదరు.

వ్యక్తి తన స్వంతబుద్ధిని వుపయోగించి కొంతవరకు కార్యసాఫల్యం పొందగలడు. కాని, పైన వివరించినట్లుగా సమాజపు సహాయం లభించకపోతే తన విశేషజ్ఞత మృగ్యమే. ఎందుకనగా తన స్వంతభాగము యిందులో చాలా కొంచెం; మనం పొందిన యోగ్యతలో మన కృషి అత్యల్పమైవుంటూ, సమాజపు కృప అత్యధికమైవుండగా సమాజమునకు యెక్కువలో యెక్కువ సేవ చేసి, తక్కువలో తక్కువ ప్రతిఫలం పొందటమే మన కర్తవ్యంగా వుండవలెగదా! ఇదియే న్యాయంగదా! కాని అందుకు సరాసరి భిన్నంగా ప్రస్తుతము జరుగుచున్నది. వ్యక్తి

సమాజమునకు వీలైనంత తక్కువ యిచ్చి, సమాజంలోనుంచి వీలైనంత యెక్కువ పొందవలెనని ఆశిస్తున్నాడు. ఆ కొంచెం సైతం యివ్వకపోయేమార్గం లభిస్తే అందుకై అతడు కించిన్మాత్రం కూడా బాధపడడు. ఆలోచన చేసి చూస్తే వ్యక్తికి ధన సంపాదనకు మార్గం యెటునుంచి వచ్చినది? సమాజం అంగీకరించిన పద్ధతిలో నుంచి అమలులోగల ఆర్థిక వ్యవస్థవల్ల ఆ మార్గం దొరికింది. కేవలం తన యిష్టంమీద ఆధారపడిన విషయం కాదది. రేపు ఆర్థిక సమానత్వపు జమానా వచ్చినపుడు యీ వేళ పైసల రూపంలో చేర్చిన ధనం ఆనాడు అక్కరకు వస్తుందా?

## బుద్ధిని ధనసంపాదనకు వినియోగించుట ఉచితమా?

బుద్ధిని ధనార్జనకు వుపయోగించుట న్యాయమా అనే ప్రశ్న చాలా పెద్ద ప్రశ్న. అది అమితముఖ్యమైన ప్రశ్న. బుద్ధిని ఆ విధంగా వుపయోగించుట ప్రస్తుత ఆర్థిక విషమావస్థకు ఒక ముఖ్య కారణమని స్పష్టంగా మనకు తెలుస్తున్నది. శోషణ, పీడనకూడా బహుశః యిందువల్లనే కావచ్చును. సమాజంలోగల ఆర్థిక, సామాజిక విషమ పరిస్థితులు, శోషణవలన కలిగే అశాంతి-వీటిని పోగొట్టుటకై ప్రపంచంలో అనేక విధానములు ప్రతిపాదింపబడినవి. వీటిలో కొన్ని అమలు జరిగినవికూడా. అహింసద్వారా సమాజంలోని విషమతను పోగొట్టుటకు గాంధీజీ సూచించిన విధానం ఒకటివున్నది. సూత్రప్రాయంగా దానిని యీ విధంగా వివరించగలము— 'కడుపు నింపుకొనుటకు చేతులు, కాళ్ళు వుపయోగం కావలెను. జ్ఞానార్జనకు, జ్ఞానదానమునకు బుద్ధి వుపయోగం కావలెను. ప్రతి ఒక్కరికి నాలుగు గంటలు దినానికి శరీరశ్రమ ఉండవలెను; నాలుగు గంటల మానసిక పరిశ్రమకు అవకాశం వుండవలెను. శరీరశ్రమద్వారా ఆ వ్యక్తి

జీవన నిర్వహణ కావలెను. నేటికీ సమాజంలో అనేకులు శరీర పరిశ్రమచేతనే తమ్ము తాము పోషించు కుంటున్నారు. కొద్ది మందిమాత్రం పనిలో ఎవరిశ్రద్ధ చాలా తక్కువో అట్టివారు ఇందులో ఎక్కువమంది గలరు. బుద్ధిచేత శ్రమించి జీవిస్తున్నారు. వీరికి పనియందు శ్రద్ధతక్కువైనా, ఎక్కువ సుఖం దొరుకుతున్నది. ఈ బాపతు వారిలో అనేకులకు కష్టపడే అలవాటు లేనేలేదు. ఈ స్థితిలో గాంధీజీ సూత్రమును అవలంబించుట చాలా దూరపు విషయంగా గోచరిస్తుంది. ఐనప్పటికీ ఆ సూత్రంలో యిమిడి వున్న సత్యమును మనం గ్రహించక తప్పదు. మన దుర్బలత్వం చేత ఆ విధంగా మనం నడవలేక పోవచ్చును. అది వేరేవిషయం. కారణమేమనగా:-జీవికకు అవసరమైన సాధన సామగ్రి ఏదో ఒక విధమైన శ్రమ లేనిదే ఉత్పన్నం కావడంలేదు. అందువలన, శరీర శ్రమ చేయకుండా, అట్టి సామగ్రి ఉపయోగించుటకు ఎవరికీ అధికారం వుండగూడదుగదా! పైసలిచ్చి మనం సామగ్రి ఖరీదు చేయగలముగాని ఆ పైసల మూలము కూడా శ్రమ శక్తి అనే విషయమును మనం జ్ఞప్తియందుంచుకొనవలెను. ఇంతే గాక, ఇంకొక సంగతికూడా మనకు విశదంగా తెలుస్తున్నది. సమాజ హితం కొరకు గాక స్వార్థమునకు బుద్ధిని వుపయోగించిన యెడల హాని కల్గుచున్నది. ఈ స్వార్థము వ్యక్తిగతము లేక సాముహికము కావచ్చును. దేశంపేరటకూడా ఇది ప్రబలం కాగలదు. ఏవిధం చేతనైనా, ఇందువల్ల ఇతరులకు ప్రమాదమే సంభవము. ఆటంబాంబు కూడా బుద్ధిని స్వార్థంకొరకు వినియోగించి నందువల్లనే ఉత్పన్నమైనది.

అనేక మంది మిత్రులంటూ వుంటారు: "శరీర శ్రమ మూల్యమును అంగీకరించినట్లే, బుద్ధి శ్రమయొక్క మూల్యమును అంగీకరించుట న్యాయం. అదికూడా శ్రమయేగదా! కాళ్ళు

చేతులాడిస్తేనే శ్రమఅవుతుందా? బుద్ధిచేత శ్రమించేవారికి, శరీర శ్రమచేసి తమ పోషణ జరుపుకునేందుకు సమయం లభ్యం కావడంకూడా అసంభవం. శరీరశ్రమ చేసేటప్పుడుకూడాను, బుద్ధిని ఉపయోగించినందువల్ల అధికమైన సఫలత చేకూరగలదు. కొన్ని పనులు ఇట్లున్నవిగదా అంటే అవి మంచి చదువరుల చేతనే కాగలవు. ఎంతవరకు నేటిపరిస్థితి నడుస్తూవుంటుందో, అందులో అనుకూలంగా పరివర్తన ఎంతవరకైతే కలుగదో, అంతవరకు యిట్టి మాటలకు మహాత్వం వుంటుంది. ఇక్కడ మనం చర్చించేది ముఖ్యమైన సిద్ధాంతముల విషయం. వ్యావహారిక దృష్టిలో, అందులో కొంచెం సడలింపురావచ్చును-దానిని సహించవలసివుంటుంది. ఐనప్పటికీ బుద్ధిజీవుల, శ్రమజీవుల ఆదాయములలో ఇప్పుడున్నంత భేదము వుండవచ్చునా అన్నప్రశ్న జవాబు కొరకు ఎదురు చూస్తూనే వున్నది. బుద్ధిజీవుల వేష భాషలు, ఉనికి అలవాటుగా ఒక విధంగా వుంటున్నవి గనుక అధికమైన ఆదాయంలేకుంటే వాటిని నిభాయించటం కష్టమని జవాబు రాగలదు. ఐతే ఆ అలవాట్లు ఎట్లు గలిగినవి? వాటిని సవరించుటకు ఇప్పటికైనా వీలవునా, కాదా? ఇష్టపూర్తిగా మనం వాటిని సవరించుటకు ఎందుకని ప్రయత్నం చేయరాదు? ఈ శక్తిహీనత మనలో వున్నంతవరకు, ఇప్పటికన్న ఎక్కువ సుఖము, సౌకర్యము కలిగినప్పటికీ, మన పరివారంలోని వారి శక్తిహీనతలు వృద్ధి చెందగల అవకాశం వున్నదే గాని, అన్యత్రా ప్రయోజనం శూన్యం. ఇదంతా తెలిసిన పిదప, నేటి విషమ పరిస్థితిని సమర్థించడం ఎలా సంభవము?

## ధనికులు ధర్మకర్తలు కావలెను

కొందరు మిత్రులు ఈ విధంగా కూడా వాదించెదరు: "మా సంపత్తిలో స్వల్పభాగమే స్వంత ఉపయోగానికి వాడబడుచున్నది. సమాజమునకు అవసరమైన వస్తువులను తయారుచేసి, పెట్టుబడి బలంతో నడువగల పెద్ద పెద్ద పరిశ్రమలలో అత్యధిక భాగం వినియోగ మవుతున్నది. మా ప్రయత్నముల కారణముగా అనేకమందికి పని కలుగుచున్నది. వారికి పోషణ జరిగి పోతున్నది, ఒక విధంగా మేము సమాజమునకు సేవ చేస్తున్నాము. వ్యక్తులవద్ద అధికంగా సంపత్తి చేరక పోతే యీ పని జరిగేదెట్లా? సమాజపు వ్యవహారములు చాలా ఆగి పోగలవు." పేదలకు పోషణ జరుగుచున్నదనే మాటకు జవాబు యింతే చాలుగదా— శ్రీమంతుల కార్ఖానాలు, కార్య కలాపం బీదలు లేకుండా సాగనే సాగవు. అసలు ఇట్లెందుకు భావించరాదు — శ్రామికుడైన పేదవాడు ధనికునికి వుపకారం చేస్తున్నాడు; ఆ వుపకారం వల్ల ధనికునికి ఆదాయం కలుగుతున్నది,

ద్రవ్యం అధికంగాగల వ్యక్తియే గాక ప్రభుత్వం లేక సహకారసమితి కూడా పరిశ్రమను నడుపుతున్నారు; అందువలన ధనిక వ్యక్తులద్వారానే పరిశ్రమలు సంభవం అనే అంశం చెల్లుబడికాదు. దీని వివరంలోకి మనం యిప్పుడు పోవద్దు. ధనికుల దృష్టిలోనే సంగతి సందర్భాలను ప్రస్తుతము పరిశీలించెదము. తమ అధికతరమైన ప్రయాసవలన సమాజమునకు మేలే కలుగుతున్నదని వాదించే ధనిక సోదరులకిదే సమాధానం: "ఈ ప్రయాస అంతా మీరుపడేది స్వంతలాభంకొరకా, సమాజహితమునకా?" వాస్తవంగా యీ ప్రయాసకు హేతువు స్వార్థమే

కాని యితరులకు అందువల్ల లాభం కలిగితే అది వారి భాగ్య మని మనం భావించవలెను; అట్లుగాక యీ ప్రయాస కంతటికి హేతువు నిజంగానే దేశ కల్యాణదృష్టి అయినట్లయితే, అట్టి ప్రయత్నమునకు మనం స్వాగతం యీయవలసినదే. ఇందు విషయమై మనం చెప్పగలిగిన మాట ఒకటే; ఇట్టి ప్రయత్న పరులు తమ పనులన్నిటిలోను నిజాయితీని కన్పరచవలెను. ధనికులు అధికమైన తమ సంపత్తిని సమాజ హితంకొరకు ధర్మకర్తవలె ఉపయోగించ దగునని మహాత్మాజీ తెలియజేసి వుండలేదా? సంపత్తిదాన యజ్ఞము, భూదాన యజ్ఞము వీటి ఆఖరు ఆశయం యేమిటి? మనవద్ద అవసరంకంటె యెక్కువ యెంతైతే వున్నదో దానిమీద మన అధికారం లేదనుకొని దాని వుపయోగము యితరులకై చెందునట్లు చేయవలెను. ఇదియే ఆశయం.

## మామూలు దానములోని దోషము

ధనికుల దానంవల్ల అనేకమైన సామాజిక ప్రయోజనములు పొందబడుచున్నవి. వైద్యశాలలు, విద్యాలయములు, మొదలగునవి—వ్యక్తులవద్ద ద్రవ్యం చేరకపోతే, ఈ పనులు జరిగే దెట్లా? అనే చర్చకూడా కొందరు మిత్రులు చేసెదరు. నిజానికి అటువంటి సాముదాయిక ప్రయోజనములు ప్రభుత్వ కర్తవ్యం. కొద్దిమంది వ్యక్తులవద్ద గాక, సమాజంలో సంపత్తి, వ్యాపించి వున్నట్లయితే, సహకార విధానంద్వారా పెద్ద యెత్తున ఇటువంటి పనులు సులభంగా సాధ్యం కాగలవు. వాటి లాభమును పొందువారు యాచకునివలె, దీనునివలెగాక, సమ్మాన పూర్వకంగా పొంద గలుగుదురు. ధనికుల దృష్టిలో జూచినప్పటికీ, కోట్లకొలది సంపత్తిని ప్రోగుచేసి, అందులో కొన్ని లక్షలు

దానధర్మములందు వ్యయపరచినంత మాత్రమున, ఇతరులకు చెందవలసిన వస్తువులు తనవద్ద చేర్చుకున్న దోషంనుంచి, ధనికులు విముక్తి పొందజాలరు. మంచిగానో చెడ్డగానో చాల ధనం సంపాదించి, అందులో కొంచెం భాగం దానం చేయడం పూర్తి ప్రాయశ్చిత్తం కాదు. నాల్గు వైపులా ధనికులు దానం చేసేరీతిని పరికించినయెడల, అందులో శుద్ధిగలదానము ఎంత వుంటుందో తెలుసుకొనుట కఠినమే కాగలదు. ఎక్కడ జూచినా, ఖ్యాతి లేక స్వార్థము, ఈ రెంటిలో ఏదో ఒక దృష్టిన ఎక్కువగా దానము జరగడం చూస్తున్నాము. కొన్ని సమయములందు, దానపు వస్తువు వ్యాపారపు సామగ్రికంటె ఎక్కువ కఠోరంగా వుంటుంది. ఒకలక్ష దానమిచ్చి, పదిలక్షల కీర్తిని సంపాదించదలచే వారున్నారు. పరిశుద్ధమైన సాత్వికదానము అపురూపమే అవుతున్నది.

## ప్రారబ్ధవాదము

ఇతర దేశములందు, అన్యమతముల యందును లేని ఒక ప్రత్యేక విషయము భారత దేశంలో సాంప్రదాయకంగా నడిచి వస్తున్నది. దాని పేరే ప్రారబ్ధ వాదము. పూర్వ జన్మములో పుణ్యముచేసిన వారికి ఈ జన్మలో సంపత్తి, సౌఖ్యము ఒనగూరుననీ. పూర్వ జన్మలో పాపము చేసినవారు ఈ జన్మలో పేదరికమును అనుభవింతురు, కష్టముల పాలవుదురనీ ప్రారబ్ధ వాదపు తాత్పర్యము. అట్లయినప్పుడు, ఒకర్ని ఒకరు దోషులుగా ఎంచుకోవడ మెందుకు ? ఈ విధంగా వాదోపవాదములు జరుగుతూ వుంటవి మామూలుగా. కాని శ్రద్ధతో వెల్వడే వాక్యములేనా అవి ? నిజంగా శ్రద్ధతో కూడిన వాదనను గురించి మనం చింతించనక్కరలేదు. పూర్వజన్మతో

ఈ జన్మకు సంబంధంవుంటే, ఈ జన్మకూ రాబోవు జన్మకూ సంబంధం నిస్సంశయంగా వుండనే వుంటుంది. మన భాగ్యంకొలదీ ఈ జన్మలో మనకు దొరికిన సౌఖ్యమేమో దొరికింది, లేనిది లేదు; కాని ముందుజన్మలో సౌఖ్యం పొందుటకై మనం మార్గాలు వెతకడం ఇప్పుడు మన చేతిలో పనిగదా ! రాబోవు జన్మలో సుఖం, శాంతి మనకు లభ్యంకావలెనంటే ఈ జన్మలో మనం పుణ్యం చెసుకోవలసి యున్నది. ప్రారబ్ధవాదము విశేషవ్యాప్తిచెంది సర్వజన సమ్మతంగా ఆచరణయోగ్యమైతే, ఇక అంతకన్న కావలసినది ఏమున్నది? సమాజంలో శాంతి సౌఖ్యములు స్థిరపడి వుండగలవు. కాని అదృష్టరేఖయందు విశ్వసించి, మాట్లాడక ఊరుకున్నవారెవరు కానరారు. ప్రతిఒక్కరు తమధ్యానము నంతా లగ్నముచేసి, సంసారపు ఝుంఝూటంలో మునిగి తేలుతూవుండడం కానవస్తున్నది. చాలమంది ఈ కార్యంలో మునిగి వుండి, సంపత్తిని ప్రోగుచేయడంలో పాప – పుణ్యముల తారతమ్యమును సైతం మరచిపోతూవుంటారు. భ్రష్టాచారము విపరీతంగా పెరిగిపోతున్నదని రాత్రిందివసములు మనం ఫిర్యాదు చేస్తూనే వుంటాము. ఇందువల్ల విశదమయ్యే విషయ మేమిటి ?

ఈ భ్రష్టాచారం- పాపం సర్వం పేదలవల్లనే చేయబడుచున్నదని అనుకుందామా ? ధనికులకు అందులో పొత్తులేదని భావించుదామా? అట్లనుకొనుట శుద్ధతప్పు. నిజానికి ధనికుల పాపం తక్కువకాదు. ధనికులు ద్రవ్యసంపాదన కొరకు పాపం చేసేందుకు జంకటం లేదు. అట్టితరి, వారు వెల్లడిచేసే ప్రారబ్ధవాదము నిజంగా వారి అంతరాత్మలో నుంచి వెల్వడిందని మనం భావించగలమా? ఈ ప్రారబ్ధవాదమును ఇట్లే నడిపించవలెనంటే, పేదలుకూడా ఇక యీ వాదమును పురస్కరించుకుని ఇట్లనగలరు: "అయ్యో, యిక మా భాగ్యరేఖ మారిపోతున్నది.

ధనవంతుల సంపత్తిని దోచి మా భాగ్యమును వృద్ధిచేసుకోవల సిందని, అందులో దోషంలేదనీ మా ప్రారబ్ధం మాకు సూచిస్తున్నది." ఈ విధంగా ప్రారబ్ధవాదము రెండు వైపుల పదునుగల కత్తి కాగలదు. బీదల సంఖ్య ధనికులసంఖ్యకంటె అధికం గనుక, ధనికులకు ఈ ప్రారబ్ధవాదము మహా ప్రమాదజనకము. వాండ్ల కర్మ వాండ్లనుభవిస్తారు, పో! అని పేదలను నిర్లక్ష్యం చేయుట వలన భయంకరమైన పరిస్థితులు ఏర్పడగలవు. చాలా కాలంగా బీదలను లోకంలో అవహేళన చేయడమైనది. ఇక లక్ష్మీనారాయణ స్థానంలో దరిద్ర నారాయణ ఉపాసనజరగవలెను.

## స్వార్థమునకు అవకాశము ?

అర్థశాస్త్రజ్ఞుడు ఈ విధంగా వాదిస్తున్నాడు: వ్యక్తి స్వార్థంకొరకు అవసరపడకపోతే, దేశంలో ఉత్పాదన, సంపత్తి వృద్ధి కానేరవు; క్షేమంకూడాలేదు. మనుష్యునియందు స్వార్థ వృత్తి స్వాభావికమని అనుకున్నప్పటికి, ధనికులు తమ స్వార్థమే ఎంచినప్పటికీ, సమాజంలో సాముదాయక, వ్యక్తిగత స్వార్థములకు విరోధం కలిగినపుడు, వ్యక్తిగత స్వార్థమునకు మహాత్వం ఏమీ వుండదు. అర్థశాస్త్రజ్ఞుల చర్చలో అధికమైన పెట్టుబడిని సంగ్రహించుట అనివార్యము. కాని, సర్వోదయ సమాజమునందు పెట్టుబడికన్న యెక్కువగా మనుష్యుని స్థానమున్నది. అన్నిటికంటె ఉచ్చస్థాయిలో మానవుని స్థానమున్నది. వికేంద్రితమైన ఉత్పాదన, క్షేత్ర స్వావలంబనము వీటిలో మనుష్యబలమునకు, శరీర శ్రమకును మహత్వ మున్నది; కొంచెము పెట్టుబడి చాలును. కొన్ని వస్తువులకొరకు పెద్ద కార్ఖానాలు అవసరమైతే, వాటిని సర్కార్ వైపునుంచి నడుపగలరు. ఈ రోజున సర్కార్ వైపునుంచి పరిశ్రమలు నడిపేస్థితి లేకపోయినప్పటికి

అటువంటి స్థితిని కలిగించనిదే దేశకల్యాణం ప్రాప్తంకాదు. ఇంత వరకు అనుభవపూర్వకంగా తెలిసిన విషయమేమనగా పెట్టుబడివల్ల పేదరికము, నిరుద్యోగము అనే సమస్యలు పరిష్కారం కావు. నైతికదృష్టితో చూచినప్పటికి స్వార్థవృత్తిని పోషించుట యోగ్యముకాదు. ఎంత యోచించినా స్వార్థములోని భావము పరార్థమునకు హానికలిగించడమే అవుతుంది. అందులోనుంచే స్పర్థ పెరుగుతూవుంటుంది. దాని వలన కొలదిమంది మాత్రమే లాభపడగలరు. బహుసంఖ్యాకులకు హాని చేకూరగలదు. మానవోచితమైన సహయోగమునకు మారుగా అరణ్యాశాసనం లేదా మత్స్యన్యాయం అవలంబనీయమైనది. సమాజక్షేమము యే వృత్తిచేత సంభవము ? అనే అంశమును పరిశీలించవలెను. సమాజంలో స్వార్థవృత్తిని అనుసరించేవారి సంఖ్య అధికం అయితే అది సమాజమునకు క్షేమకరమని ఆశించగలమా ? పరోపకార భావనలోని బలంచేతనే సమాజము ఉచ్ఛస్థాయికి రాగలదు. సంపత్తిని వృద్ధిచేయుటకు స్వార్థమును ఆధారపరచుకొనుట దోషభూయిష్టము.

## దాతను దీనుని చేసెదరా?

అర్థనీతి విషయమై కొందరు మిత్రులు అమెరికా ఉదాహరణమును ప్రస్తావించెదరు. భారతదేశంలో కల్యాణకారియగు ప్రభుత్వమును (**Welfare State**) స్థాపించెదరని కూడా వినికిడి. అట్టి ప్రభుత్వం యొక్క ఉద్దేశ్య మేమనగా అన్నివిధములైన దుర్బలులకు రాజ్యాధికారం ద్వారా సహాయం లభ్యంకాగలదు. అనగా పెద్దయెత్తున పన్నులు వసూలుచేసి అందులోనుంచి పేదలకు సహాయం చేయడమవుతుంది, భారతదేశంవంటి దరిద్రపు దేశంలో అట్టి విధానం అనుసరణీయం కావటం అసంభవం కాని, ఆరోగ్యం,

శిక్షణ అనే అంశములందు ప్రభుత్వ ప్రజాళిక కల్యాణకారి అవుతుందంటే ఆ విషయమును అర్థంచేసుకోగలము. కాని ఆర్థిక విషయములందు అనగా కడుపునింపుకొనుటకు మనుష్యుడు ప్రభుత్వంమీద నమ్ముకునివుండుట యెంతవరకు వుచితము? ప్రాథమిక అవసరముల విషయమై మనుష్యుడు తన కాళ్ళమీద తాను నిలబడి వుండలేకపోతే, స్వతంత్రుడు కాజాలడు. ఏదో విధంగా వాడు పరాధీనుడై వుండక తప్పదు.

అమెరికావంటి దేశపు ఉదాహరణ మనకు పనికిరాదు. ప్రపంచమంతటినుంచీ వెళ్ళి సంపత్తి అక్కడ సమగూడినది; పేదలకు సైతం ఆ దేశంలో సౌఖ్యం లభిస్తున్నది. ఇప్పటి మనస్థితిలో గాని, కనుచూపు మేరలోగల భావిస్థితిలోగాని మనదేశానికి అమెరికా దృష్టాంతము యేమి ప్రయోజనము? మనవద్ద ప్రతి సంవత్సరం యెక్కడనో ఒకచోట కోట్లకొలది ప్రజలు దరిదాపు క్షామ పరిస్థితులలో కాలం గడపవలసి వస్తున్నది. ఇప్పుడే ధాన్యాగారం నిండినది. కాని, కొన్ని ప్రాంతములలో యిప్పటికీ ఆకలి బాధను వోర్చుకొనక తప్పడంలేదు. ధాన్యం ఖరీదు చేసుకొనుటకు పేదలవద్ద పైసా లేదు. పనిలేనందువల్ల పైసాలేదు. ధనికులు నడిపే కేంద్రీకృత పరిశ్రమల విధానంవల్ల నిరుద్యోగులు పెరిగినారు. ఆ విధానం నడిచేవరకు గ్రామోద్యోగములందు నిరుద్యోగులను ప్రవేశపెట్టుటకు విశేషంగా వీలులేదు. కాగా పోగా చేసేదేమిటంటే కల్యాణకారి ప్రభుత్వంవలె మన సర్కారువారూ, కొందరు దానపరులు నిరుద్యోగులకు కొంచెం సాయపడుతూ వుంటారు. ఇంతటితో సరియా కర్తవ్యం? చూడండి, కొందరు గంజిపోస్తున్నారు; కొందరు దానిని త్రాగుతున్నారు. కొందరు దయగలవారు వస్త్రదానం చేస్తున్నారు; కొందరు అర్థనగ్న

శరీరములతో వాటిని స్వీకరిస్తున్నారు. పత్రికలలో యిదంతా ఫోటోల రూపంగా వెల్లడికూడా అవుతున్నది.

ఐతే యీ దృశ్యమును కండ్ల ముందరికి తెచ్చుకుని ఒక సారి పరిశీలించండి. మనుష్యుని హృదయమును కలతపెట్టే దృశ్యం కాదా యిది? ఒక వ్యక్తి వస్తువును పంచిపెట్టే స్థితి లోనూ, మరొకడు దానిని పొందే దీనావస్థలోను వున్నారా! నేటి దాతలు ఒక నాటికి అట్టి వస్తువుల కొరకు చేయి జాచ వలసి వచ్చినపుడు వారికి ఆ దీనావస్థ బోధపడ గలదు. స్వరాజ్యం ప్రాప్తించిన తదుపరి కూడా, యీ స్థితి యెంతవరకు నడుస్తూ వుంటుంది? ప్రతి ఒక్కరికి యథోచితంగా తిన తిండి, కట్టు బట్ట, పండ నిల్లు లభించిన పిదప యేదైనా కొంచెం మిగిలితే ధనికులు దానిని తమ వద్ద చేర్చుకొని వుంటే వుందురు గాక! ఒక విధంగా ఆ మిగిలినదానిని అట్లు చేర్చుట కూడా అపాయకరమే. ఎంతవరకు పేదల జీవన నిర్వహణ చక్కగా జరగదో అంతవరకు ధనికులు మనోవ్యధ పడక తప్పదు. మేడలలో కాపురం వుండేవారు తమ యిండ్లముందర వీధి బాటలందు యిల్లు-వాకిలి లేక పడివుండే జనమును చూచి, ఆ జనం యీ విధంగా యెందుకని కాలం గడుప వలసి వస్తున్నదో గమనించారా? మోటారులో వెళ్ళేవారు, దారిలో కనుపించే 70 యేండ్ల వృద్ధ స్త్రీ కట్టెలో, గడ్డియో నెత్తిమీద పెట్టుకొని యెందుకు పోతున్నదో గమనించారా? ఇటువంటి దృశ్యములపై విచారణ చేసినట్లయితే తమవద్ద అధికంగా సంపత్తిని వుంచుకొనే అధికారం వున్నదా లేదా అనే అంశం చాలవరకు విశదం కాగలదు.

## దేశమే కుటుంబము

ఒక పరివారంలో అయిదుగురు వ్యక్తు లున్నారనుకుందాం. వారి కడుపు నింపుటకు నాలుగు శేర్ల ధాన్యం కావలెను. నాలుగు శేర్లూ దొరికితే, అయిదుగురూ కడుపునిండా తింటారు. మూడు శేర్లే లభ్యమైతే యేంచేస్తారు? ఒకరిద్దరిని ఆకలితో వుంచి, మిగిలినవారు కడుపునిండా తింటారా? పరివారంలో అట్టిపని యెప్పుడూ జరగదు. అవసరమున్న దానికంటె తక్కువ దొరికితే తలాకొంచెం తక్కువగానే వాడుకుని సర్దుకుంటారు. బాలబాలికల విషయం, వృద్ధుల విషయం మొదట చూస్తారు. సామాజికదృష్టిలో యిదే న్యాయమును సమాజంలోని వ్యక్తులందరు అనుసరించుట ధర్మము. రాజ్యకర్త, సమాజము – ఈ ఉభయుల దృష్టిలో దేశమంతా ఒక పరివారం. దేశంలో సంపత్తి పుష్కలంగా వుంటే అందరూ భోగించగలరు. సంపత్తి కొరతపడితే ప్రతిఒక్కరూ కొంచెం కొంచెం కష్టం సహించి, త్యాగం చేయుటకు సిద్ధంకావలెను. ధర్మముకూడా ఈ విషయమునే మనకు బోధిస్తున్నది. మన నోటివెంట సమయాసమయములు లేకుండా తత్వజ్ఞానపు వాక్యాలు వెల్వడుతూ వుంటవి. స్వ-పర భేదం కూడదు. అందరియందు ఆత్మ సమానము. అందరినీ ఈశ్వరుడే సృజించెను. మనమందరము అన్నదమ్ములము, అక్కచెల్లెండ్రము. ఇటువంటి మాటలన్నీ సహజంగా మనం అంటూ వుంటాము. ఈ మాటలకు ఆచరణకు సదా మైత్రిని నెలకొల్పుటకు మనం ప్రయత్నం చేస్తూ వుండవలెను.

## శరీరశ్రమపట్ల అనాదరణ

శరీరశ్రమ విషయమై మన సమాజంలో వుండే ఆలోచనలో విపరీతమైన దోషం గలదు. ఇంకే దేశంలోనూ బహుశా

యిట్టిది లేదు. మనం శరీరశ్రమ చేయుటకు ఇష్టపడము. ఇంతే గాక కష్టించుట నీచమనికూడా భావింతుము. పైగా, శరీరశ్రమ చేయువారిని హీనమైన తరగతిలో లెక్కవేసెదము. ధనికుడు గానీ దరిద్రుడుగానీ శ్రమచేయుటకు ఇష్టపూర్తిగా అంగీకరించడు. ధనికుడు తన ధనబలంద్వారా నౌకర్లచేత తన పని చేయించు కుంటాడు. పేదవాడు ఆకలిబాధకు తాళలేక విధిలేక పని చేస్తాడు. ఈ పద్ధతిని మనం మార్చవలెను. శరీరశ్రమ ప్రతిష్ఠను కేవలం స్థాపించి సంతోషపడరాదు, అందుకొరకు మనస్సులో దానియందు ప్రీతి కలుగవలెను. ధనికవర్గము, మధ్యమ వర్గముల లోనివారు ఈ సంగతిని తాము తెలుసుకొని, ఇతరులకు తెలియ జెప్పవలెను.

## ఆర్థిక విషమావస్థ పోనిది శాంతిలేదు

శరీరశ్రమ లేకుండా సంపత్తి ఉత్పన్నం కాదని ఇదివరకే తెలుసుకుంటిమి. అనగా ధనికులవద్ద చేరిన సంపత్తి పేదల శరీర శ్రమవలన కలిగినదని తెలుసుకుంటిమి. ఇంతేగాక ధనికులు పేదల సహకారం లేనిది సంపత్తిని సంపాదించలేరు, తమవద్ద దానిని వుంచుకొనలేరు, దానిని ఉపయోగించలేరు. న్యాయ దృష్టితో విచారిస్తే, అవసరంకన్న ఎక్కువ ఎవరూ అధికంగా సంపత్తిని వుంచుకొనుటకు లేక సంపాదించుటకు అధికారమును కలిగి వుండరాదని నిర్ణయమైనదనికూడా తెలుసుకోగలము. అయితే అవసరమంటే ఎంత అనే ప్రశ్న ఉదయించగలదు. మనిషి మనిషికీ మధ్య అవసరముల విషయంలో ఎక్కువభేదం వుండ రాదు; రోగులు—నిరోగులు, బాలకులు—యువకులు, ఇట్టి వారిమధ్య కొన్ని అంతరము లుండగలవు. అవసరముల విష యంలో వాటిని మన్నించడం ఉచితముకూడాను. న్యాయ

దృష్టితో చూస్తే, అవసరముల విషయమై నిర్ణయం చేయడం కష్టమైన పనికాదు. కాని, స్వార్థము, సాంసారిక మోహము, ధనమందు ఆసక్తి మొదలగు దోషములు ప్రకోపించినపుడు సమస్య జటిలం కాగలదు. అవసరమనే అంశమును గురించి ఎక్కువలోతుగా మనం వెళ్లి చూడనక్కరలేదు, ప్రస్తుతము. ఇప్పటి సామాజిక ఆర్థిక విషమావస్థ న్యాయోచితం కాదని మనం తెల్సుకుంటే, ప్రస్తుతం అంతేచాలును. దానిని మార్పు చేయవలెను. ఇది ఈ సమయమున కావలసిన మార్పు. దానిని అతిక్రమింప వీలులేదు. ప్రతి తావున, ఇట్టి విషమావస్థ వుంటూనే వున్నది. వేలసంవత్సరముల వరకు నడిచింది. సాధువులు, యోగులు మనకు ఉపదేశం చేస్తూనే వచ్చినారు. అన్ని మతములలోనూ ఈ సాంప్రదాయం వున్నది. 'పేదలను కనిపెట్టండి. నీవద్ద ఎక్కువవుంటే, దానిని ఇతరులకు ఇవ్వు.' దానం, ధర్మం మొదలగు వ్యవహారం జరుగుతూ వున్నప్పటికీ, పేదరికం అనే ప్రశ్న పరిష్కారం కాలేదు. అట్టి ఉపాయములవల్ల పరిష్కారమయ్యేటట్లు కన్పించడంలేదుకూడాను.

ప్రపంచంలో కొంతకాలంగా దయ స్థానంలో సమత అనే భావం ప్రజల ఎదుటకు వచ్చినది. వదహారణాల సమత సంభవం కానీ కాకపోనీ ఇప్పటి విషమావస్థ సహింపరానిది గనక, దానిని దూరంచేసే మార్గమేమిటి? అనే ప్రశ్న బయలుదేరినది. అక్కడక్కడా హింసావిధానమును ప్రజలు అనుసరించిరి. అందులో నుంచి చాల చెడుగులు ఉత్పన్నమైనవి. ఇప్పటివరకు ఆ చెడుగులను తొలగించుటకు సాధ్యం కాలేదు. సామాజిక విషమావస్థను తొలగించుటకు చట్టం కూడా కొంచెం తోడ్పడగలదు. భారతదేశంలో కొన్ని అంశములందు శాసనచక్రం తిరగడం ఆరంభమైనది కూడను. కాని చట్టము ద్వారా మాన

వునికి ఉచితమైన గుణముల ప్రకాశము, సద్భావన, వికాసము కలుగనేరవు. మహాత్ముడు మనకు అహింసావిధానము ప్రబోధించెను. దాని అనుభవంకూడా మనకు కలిగినది. భారతదేశపు సాంప్రదాయమును సైతము పరికించి చూడగా మన సామాజిక విషమావస్థను చాలవరకు అహింసా మార్గంలో పరిష్కరించుకొనుట సంభవమని తోచుచున్నది. ఇందులో ధనికుల పూర్తి సహకారం కావలసియున్నది. వారి హృదయములందు పరివర్తన కలుగవలెను. దీని ప్రభావము శాసనంచేసే శక్తిమీద చాలవరకు పడగలదు. మన సామాజిక కార్యక్షేత్రములందు సద్గుణముల వికాసము కలుగును. భారత రాజనైతిక స్వరాజ్యసమస్య చాలవరకు అహింసామార్గముద్వారా పరిష్కారమైనట్లే, ఆర్థిక సామాజిక సమత అనే సమస్యకూడా పరిష్కారం కాగలదని మనం గట్టిగా విశ్వసించవలెను. వినోబాజీద్వారా నడిపించబడే భూదాన, సంపత్తిదాన యజ్ఞములందు మనం అందరం చిన్నా-పెద్దా, కలవారు-లేనివారు, యిష్టపూర్తిగా సహకరించవలెను.

## పేదలవద్ద దాన మెందులకు?

భూదాన యజ్ఞమునందు పెద్ద భూస్వాముల వద్దనుంచి చాల విశేషముగా భూమి దొరికే అవకాశం వున్నదని మనం భావిస్తూ వుంటాము. వెంట వెంట కొలది భూమిగలవారి వద్దనుంచి కొంత భూమి దానముగా లభ్యంకావచ్చును. రెండు దానములను తూకంవేసి చూచినట్లైతే కొలది భూమిగల వారి ఔదార్యము యెక్కువయని ప్రకటితమైనది. ఇది అనుభవము. భూదానయజ్ఞములో వలెనే సంపత్తిదాన యజ్ఞములోకూడా అందరు తమ తమ శక్త్యానుసారం వరుంబడిలో ఒక భాగాన్ని దానం చేయగలరని ఆశించెదము. ఐదు-పది ఎకరముల భూమి

వున్న వ్యక్తివద్ద దాన మెందుకు స్వీకరించెదరు? అనే ప్రశ్న ఒకటి వున్నది. అల్లే ఒక వ్యక్తి పేదరికంలోవుంటూ ఇంత తనకు దొరికితే బాగుండుగదా అనే అభిప్రాయం కలిగివుండగా అట్టి వ్యక్తిని సంపత్తిదానంలో భాగస్వామిగా చేరవలెనని కోరడం వుచితమా? అనే ప్రశ్న వుదయిస్తున్నది. దానమిచ్చుటలో జబర్దస్తీ యేమీ లేదు. ఎవరు యెవ్వరినీ దానమియ్యవలసిందని బలవంతం చేయజాలరు. తన యిష్టముమీద ఆధారపడినది దానము. దాత సంతోషముతో యిచ్చునపుడు అట్టి దానమును యేల స్వీకరించ రాదు? పేదరికమును అనుభవించిరి గనుక యిట్టి యజ్ఞములలో విశేషమైన ఉత్సాహంతో పేదలు చేరునట్లుగా మనకు గోచర మవుతున్నది. యజ్ఞములో హవిర్భాగమిచ్చుటకు పేదలకు ధనికులకు అందరికీ నిమంత్రణ వున్నది. ఇటువంటి విశ్వయజ్ఞము లందు అందరి చేయూతా అవసరము. అనేక పర్యాయములు పేదలు దానము చేయుట ఆరంభించినచో ధనికులుకూడా అందులో చేరెదరు. వాస్తవంగా యీ విషయంలో ధనికులు ముందడగు వేయవలసినవారు. ఐతే వారు పెద్దయెత్తున దానము చేయవలసివస్తుంది గనుకనూ, అధికమైన ఆస్తిమీద అధికమైన ఆసక్తి ఉండుట చేతనూ దానము చేయుటకు తమ మనస్సులను సిద్ధం జేసుకొని ఆత్మలో తామీ విషయములను యెరుకపరచుకొని నిర్ణయము జేసికొనుటకు కొంత సమయము వారికి కావలసి యుండును. అందువల్ల సంపన్నుడుగాని, పేదవాడుగాని, యెవరెవరి హృదయంలో ఉత్సాహం వుంటుందో వారు దానము చేయుటకు సిద్ధపడవలెను.

ఈ యజ్ఞములలో అందరినీ హవిర్భాగం వేయుటకు నిమంత్రణ చేయడంలో ఒక ఉద్దేశం కూడా ఏమనగా, ఇప్పుడు సమాజంలో స్వార్థం పెరిగి, భ్రష్టాచారం జరుగుతున్నది గనుక,

దానిమీద కొంత కట్టుబాటు వుంచవలెనని అభిప్రాయం. ఎవరు యీ యజ్ఞములో పాల్గొనునో, వారు తన మనస్సులో శుద్ధికి, అపరిశుభ్రతకూ భేదమును తెలుసుకోగలరు. స్వార్థవృత్తి పేద లలో, ధనికులలో అందరిలో వున్నది. అందరి మానసం కల్మష రాహిత్యం కావలసిన అవసరం వున్నది. స్వార్థవృత్తి నశించనిదే, సమాజముయొక్క ఉద్ధరణ జరుగదు గాన కార్యక్రమమునందు అందరు జనులు భాగస్వాములైతే, దేశీయజీవనము ఉచ్ఛస్థాయిని అందుకొనగలదు. చిన్నా పెద్దా, అందరిమీదా, ఆ ప్రభావం వుంటుంది. అవగుణముల వలెనే, గుణములనుకూడా మను షులు ఒకర్ని జూచి ఒకరు నేర్చుకుంటారు. అందరు ఆర్థికసమత, శరీరశ్రమ, ప్రతిష్ఠ, స్వావలంబనముల మహాత్వమును ఎరుగ వలెను. ప్రతి ఒక్కరూ ఇతరుల సుఖదుఃఖములను గురించి యోచన చేయవలెను. అందరం ఒకటే అనే భావము ప్రబల వలెను. అందరి స్వార్థము నశించవలెను. ఈ విధముగా గుణ ముల వికాసము అవసరము. చిన్నా, పెద్దా వ్యక్తులందరు తమ శక్త్యానుసారము ఈ యజ్ఞములందు సహాకారం చేయదగును.

## ధనమందు లాలస తగ్గుదల కావలెను

వాస్తవముగా పేదలకు సహాయం అందవలెను. ఈ యజ్ఞముల ఆశయం అదే. అయినప్పటికీ, కొంచెమే కానివ్వండి, ఏదో కొంత దానము పేదల వద్దనుంచి స్వీకరించ బడుచున్నది. ఎందుకంటే ధన లాలసత్వము వారిలోను తక్కువ కావలసిన అవసరం వున్నది. నేడు పేదలకు సైతం మన సామాజిక వ్యవ స్థలోని దోషం ఆమూలంగా తెలియలేదు. వారికి ధనవంతు లయ్యే అవకాశం లభిస్తే, దానివల్ల స్వంతలాభం పొందడానికి వెనుదీయరు. ధనికుడుగానీ, పేదవాడుగానీ, మధ్యమవర్గము

వాడుగానీ అందరిని ధనలాలస పీడిస్తున్నది. ఎవడు ధనికుడు గాడో, ధనికులయందు దోషము లెంచగలడో, వాడు ధనవంతుడు కావలెననే లాలసను లోన కలిగివున్నాడు. నాల్గు దిక్కుల ధనం కొరకు హడావిడి వుండనే వున్నది. కార్ఖానా యజమానులకు, అందులోని కార్మికులకు సదా జగడములు జరుగుతూనే వుంటవి. పేదల, కార్మికుల స్థితిగతులను బాగు పరచుట, వారి ఆదాయమును వృద్ధిచేయుట ఆవశ్యకములే. కాని, వారి ధ్యానము తమ స్థితిని వృద్ధి పరచుకొని, సవరించుకొనుట కంటె ఎక్కువగా, పైసలు ఎక్కువగా సంపాదించుకొను వైపుకే మరలి వుండును. అంతేగాక ఈ కార్ఖానాల వలన ఇతర కార్ఖానాలలో నిరుద్యోగము పెరుగుతుంది, అనేక మంది పేదలు వృత్తిని పోగొట్టుకుందురు. ఈ వైపుకు సైతం ఆ కార్మికుల ధ్యానము మరలదు. యజమానుల వలెనే కార్మికులు సైతం ఎక్కువ ఆదాయమును కోరుచుందురు. కార్ఖానా ఆదాయములోనుంచి కార్మికులకు ఒక భాగం దొరకుచుండును. గనక వారు అట్టి ఆదాయమునకు స్వాగత మిచ్చెదరు. ఈ విధంగా కార్ఖానాలలో వస్తువులను ఉపయోగించే వారు పేదల మేలును గురించి గాక కార్ఖానాకు మరింత ఆదాయం వచ్చే దృష్టినే కలిగివుందురు. సమాజములోని అన్ని వర్గాల వారి యందునూ పైసలు అధికంగా సంపాదించవలెననే లాలసకు కళ్ళెములు బిగించవలసిన అవసరం కలిగినది. ఈ తత్వమును అర్థం చేసుకొని ప్రతివారూ త్యాగవృత్తిని ప్రకటించవలెను. ఈ యజ్ఞములు ఇందులో మనకు సహాయ పడగలవు. అంతఃకరణయందు ఈ విషయమును స్పష్టంగా తెలుసుకుని ఈ యజ్ఞమునకు తగిన పరివర్తన కలిగితే, నాలుగు దిక్కులా

ఇట్టి ప్రభావం వ్యాప్తమైతే, ధనికులు సైతం ఇందు నుంచి దూరంగా వుండజాలరు.

## సంపత్తిదాన యజ్ఞములో పేదలు ఎందుకు పాల్గొనవలెను?

ఇదివరకు తెలియజేసినట్లుగా, భారతదేశం పేదలదేశం. ఇక్కడ ధనికుడు అని పిల్వబడుటకు యోగ్యులైనవారు లక్షకు ఒకడు—అరమాత్రమే దొరికెదరు. తిండికి లోటు లేకుండా సుఖంగా వుండగలవారు నూటికి పదిమంది వుంటారు. మిగిలిన తొంభై మంది పేదలు సాధారణంగా వుత్పాదక శ్రమజేసి అట్లట్లనే కష్టంతో జీవితాన్ని వెళ్లబుచ్చుతూ వుంటారు. తమ జీవనమును అతి కష్టంతోనే వారు గడుపవలెను. దేశంలో పేదరికం వుంటే, అందరూ దానిని సహించే విధానం కావలెను. ఏక దేశంలో వుండేవారిలో కొందరు భోగములతో తులతూగుట, అనేకులు పేదరికమనే బాధను అనుభవించుట న్యాయసమ్మతం కాదు. కాగా, పేదల శరీర శ్రమమీద ధనికుల భాగ్యము ఆధారపడినపుడు, యిట్టి అన్యాయస్థితి సహింపరానిది.

## యజ్ఞములో అందరి హవిర్భాగము

ఇటువంటి వుద్దేశ్యము నొకదానిని పురస్కరించుకొని వినోబాజీ భూదాన, సంపత్తిదాన యజ్ఞములను నడుపుచున్నారు. ఈ వుద్దేశ్యము సఫలమగుటకు, యీ యజ్ఞములకు ఆందోళన స్వరూపము ప్రాప్తించుట ఆవశ్యకము. అంతేగాక యజ్ఞములు విస్తృత రూపమున వ్యాప్తము కావలెను. పేదలైన నూటికి తొంభై మంది ప్రజ యీ యజ్ఞములలో చేరకపోతే యీ తత్వము వ్యాప్తము కానేరదు. సమాజమందలి భావ

ములలో కూడా పరివర్తనం కలుగదు. అందువల్ల ధనికులు పేదలు అందరు యీ యజ్ఞములలో తమతమ శక్త్యాను సారము ఆహుతిని సమర్పించవలెను.

## అందరూ చేరే మార్గం

త్యాగము యీ యజ్ఞములో ముఖ్యమైన అంగము. స్వార్థత్యాగము చేయనిదే దేశము పైకి పోజాలదు. సమాజ హితంకోసం ధనికులను త్యాగమునకై మనం ప్రోత్సహించగా, పేదలు కొంచము గూడ త్యాగము చేయకపోతే, ధనికులు త్యాగము చేయవలెనని పేదలు అనజాలరు. తాము స్వార్థ మును వీడక యితరులు త్యాగము చేయవలెనంటే, దాని పరి ణామము చక్కగా వుండదు. దేశములోని ధనసంపత్తులను చేతులు మార్పించుటయే మన పని గాదు. ఈ విషయమును తెలుసుకొనవలయును. మనుష్యుడు స్వార్థమును, లోభమును వీడవలయును. వానిని అతడు వీడునట్లు చేయుట మన కర్తవ్యము. అతడి అంతఃకరణమును శుద్ధిచేయవలయును. తన వద్దనున్న సాధనసామగ్రిని మానవుడు సదుపయోగము చేయ వలెను. తన హృదయమందు సమాజమునకు స్థాన మీయవలెను. ఇతరులకు సాయపడవలెను. పరోపకారబుద్ధిని పెంపుచేయ వలెను. అధిక సంఖ్యాకులైన పేదలు యీ ఆందోళనలో పాల్గొన్న యెడల తత్ఫలితముగా నిర్మాణము కాగల వాతా వరణ మెట్లుండు ననగా పరిస్థితి ననుసరించి అందరూ యిందులో చేరక తప్పదు. అందువలన పేదలుకూడా యీ రెండు యజ్ఞములలో పాల్గొనునట్లు చూచుట కార్యకర్తల ప్రత్యేక కర్తవ్యము.

## సమాజమునకు ఆధారము శ్రమజీవి

ఐతే, విద్వాంసుడు తన విద్యయొక్క మూల్యమును పైసలలోనే కొలుస్తున్నాడు. దీని ఫలితముగా పైసలకొరకు అందరూ హడావుడి పడుతున్నారు. శ్రమజీవులుకూడా కర్తవ్య పరాయణులు కావడంలేదు. శ్రమయొక్క ప్రతిష్ఠను పెంపు జేయుట శ్రామికుని చేతిలోని పని. ఏ శ్రమచేత సమాజమును సజీవంగా వుంచగల్గే సామర్థ్యమును కల్గియున్నాడో ఆ శ్రమ యొక్క నిజమైన మూల్యమును అతడు తెలుసుకున్నట్లయితే దేశములో ఆర్థికక్రాంతి కలుగుటలో ఆలస్యముండదు. భూదాన, సంపత్తిదాన యజ్ఞముల తత్వమును తెలుసుకొని శ్రమజీవులైన పేదలు శ్రద్ధతో యిందులో పాల్గొనినయెడల వారి తేజము వెల్లడికాగలదు. వారికి సమాజములో తమ మహాత్వమునకు యోగ్యమగు స్థానము లభించగలదు. ఒకవేళ వారికి తమశక్తి తెలిసినప్పటికీ కర్తవ్యమనే జాగృతి లేనియెడల కర్తవ్య విహీన మైన ఆ శక్తి రాక్షసప్రవృత్తి కాగలదు. సమాజమునకు దాని వలన నేడు హాని కలుగుచున్నది. భవిష్యత్తులోనూ హానికలు గును. ఈ యజ్ఞములందు పాల్గొన్నయెడల శ్రమజీవుల త్యాగ శీలము వృద్ధికాగలదు మరియు వారికి తమ కర్తవ్యము చక్కగా బోధపడగలదు.

## ఒక పేద మరొక పేదను ఆదరించవలెను

పేదరికంలో చాలా భేదములున్నవి. తిండికికూడా లేక విధిలేక అటూయిటూ తిరిగేవారున్నారు. అర్ధాకలితో వుండే బ్రతుకును యీడ్చేవారున్నారు. కష్టంతో కాలం గడిపేవారూ వున్నారు. ఏదోవిధంగా పొట్టతిప్పలు వెళ్లదీసేవారు వున్నారు. ఇట్టి దుఃఖభోగులకు పేదరికము అనుభవమైనది గనుక పేదలైన

యితరులయందు సానుభూతి వుండవలెను. కాని సాధారణంగా ఒక బీదవాడు మరొక బీదవాని స్థితిని లక్ష్యముచేయక తన స్వార్థమందే తగిలివుంటాడు. వేరువేరు కార్యక్షేత్రములందు పని చేయుచుండుటవలన శ్రమజీవులు సమాజమునందు అనేక తరగతులుగా విభాగమై వున్నారు. వీరిలో కొందరు పెద్ద కార్ఖానాలు, రైల్వే, తపాలా మొదలగు క్షేత్రములందు పనిజేసేవారు సంఘబలమును కలిగి సమాజము నెదుర్కొని తమ ఆదాయమును వృద్ధిజేసుకొనుటకు సదాప్రయత్నము చేయుచుందురు. కోట్లకొలదిమంది భూమిహీనులు, పేదలైనవారు గ్రామసీమలం దున్నారు. వీరివైపుకు పైజెప్పిన కార్మికుల ధ్యానము పోవడంలేదు. నిజానికి పట్నవాసపు కార్మికులకంటె పల్లెటూరి పేదలు చాల బీదరికంలో వుంటూ, యెక్కువ కష్టములను అనుభవిస్తున్నారు. దేశంలోని సంపత్తికి మితి వున్నది. కొందరి ఆదాయము మాత్రమే వృద్ధిఅవుతూవుంటే, యితరుల పేదరికము హెచ్చుతూ వుంటుంది. ధనవంతులుకూడా యింకా యెక్కువ కూడబెడుతూవుంటే, యిదే పరిణామము సంభవము. ఇందువల్ల, తమవద్ద కొంచెమే వుండనీ, అధికమేవుండనీ తనకంటే పేదరికంలో వున్నవానిపట్ల ధ్యానము వుంచి సాయపడుట ప్రతి మానవునికీ కర్తవ్యము. అట్లు చేయకపోతే మొత్తం సమాజం యొక్క క్షేమమును సాధించలేము.

## శక్తికొలది పేదల దానము

ఈ యజ్ఞములు పేదల మేలుకొరకే నడుస్తున్నవి. కాని ప్రతి పేదవాడు యితర పేదల మేలుగోరి స్వయంగా కొంచెము త్యాగముచేసినపుడే బీదలకు కల్యాణము చేకూరగలదు. పేదల వద్ద విశేషముగా వుండదుగనుక వారి త్యాగము నామ

మాత్రముగానే వుండగలదు. కాని ఆ త్యాగముచే వారి మానసమందు సమాజమునకు స్థానము యేర్పడగలదు. బుద్ధి పూర్వకముగా యిది సఫలం కాగలదు. ధనికులైనందువలన యెక్కువ బరువును మోయగలవారు మరింత త్యాగమును చేయవలసి యుండును. అంతశక్తిలేనివారు తమ శక్తికొలది త్యాగము చేయగలరు.

ప్రస్తుతము సంపత్తిదానమందు సాధారణముగా ఆదాయంలో లేక యింటిఖర్చులో ఆరవభాగమును అడుగుతున్నాము. కాని యిది పన్నువంటిదికాదు. దాత తన శక్త్యానుసారము యెక్కువ తక్కువ భాగమును యిచ్చుటకు సంకల్పించగలడు. మన అర్థశాస్త్రజ్ఞులు యిప్పుడు మన దేశమందు మనిషికి నెలకు రు. 20 ల ఆదాయమున్నదని లెఖ్ఖవేసినారు. ఇది సగటునవేసిన లెఖ్ఖ. అనగా కొందరి ఆదాయము అంతకంటే చాలా తక్కువ, మరికొందరి ఆదాయం అంతకంటే చాలా యెక్కువ. ఒక కుటుంబమునందు సగటున అయిదుగురున్నారనుకుందాము. నెలకు రు. 100 లు ఆదాయము వున్నదనుకుందాము. సంపత్తిదానంలో రూపాయకు అర్ధణాఅడిగితే, నెలకు ఆ బీద కుటుంబము మూడు రూపాయల రెండణాలుమాత్రమే ఖర్చు చేయవలసి వుంటుంది. పైన వివరించిన ప్రకారము యజ్ఞ మహత్వమును గుర్తించినయెడల, పేదవానికి యీ మాత్రము యివ్వడం భారమా ? యీ రోజులలో పేదలుగూడా యేదో ఒక వృధాఖర్చు చేస్తూనేవున్నారు. హోటల్, టీ కాఫీ, చుట్టా బీడీ సిగరెట్టు, సినిమా వగైరాలలో పేదలు చాలా పైసలను తగలేస్తున్నారు. అటువంటి ఖర్చులో తగ్గింపుచేసి, సంపత్తిదానం కొరకు పైసలను మిగిలించవచ్చును. అట్లే, వ్యసనములను కూడా వారు తగ్గించుకోగలరు. సమాజముయొక్క మనస్తత్వములో

మార్పు తెచ్చేటందుకు వీరు యింతమాత్రము త్యాగమునకు సిద్ధము కావలెను. వీరికి విషయము చక్కగా తెలియజేసినట్లయితే, తత్వము మనసుననాటి, యీ పనిచేయుట సులభం కాగలదు. సమాజములో యింతటి అధికమైన సంఖ్యగల పేదలు యజ్ఞ సిద్ధాంతమును అర్థముచేసుకుంటే, మొత్తం సమాజంయొక్క సిరిసంపదలకు సంబంధించిన తత్వమును మార్చగలుగుదుమను టలో సంశయ మక్కరలేదు. ఉత్సాహాముతో ఆనందముతో పేదలు యీయజ్ఞములో చేరవలెను.

## విద్యార్థులు సైతము చేరవలెను

హైస్కూళ్లలో, కాలేజీలలో పఠించు విద్యార్థులు సైతము సంపత్తిదాన యజ్ఞములో సాయపడగలరు. ఈ యజ్ఞములందు వారు ప్రచార కార్యక్రమమును సాగించగలరు. శ్రమదానము చేయగలరు. ఇంతేగాక, యజ్ఞము నిమిత్తం సమాజంకోసం తామూ కొంత ఖర్చుచేయవలెను. అయితే తాము సంపాదించుట లేదుగదా, ఉపరి ఖర్చే యెక్కువ చేస్తున్నాముగదా అని వారన వచ్చును. అయినప్పటికి, విద్యార్థి దశలోకూడా నియమిత రూపంలో త్యాగంచేసే అలవాటును వారు అలవరచుకొనుట మంచిది. సమాజమునకు సేవ జేయడం విద్యనేర్చిన తరువాత గృహస్థజీవనంలో ఆరంభించ గలమని వారనుకుంటే వారు చాల పొరబడుతున్నారు. విద్యార్థి జీవనంలో సమాజ సేవాకార్యం చేసినవారే ముమ్ముందు సమాజ సేవకు ఆయత్తం కాగల రనేది అనుభవసిద్ధమైన విషయం. విద్యాభ్యాస కాలమందు విద్యార్థుల మానసమందు వుత్తమమైన భావములు కలిగే అవకాశమున్నది. అట్టి భావములచేత వారు ప్రభావితులు కాగలరు. తదుపరికూడ సమాజ సేవ చేయవలె

ననే భావము వారికి కలుగుతుంది. ఆచరణ యందు యే భావములు గట్టిపడి, పుష్టిని పొందవో, ఆ భావములు ఆ పిమ్మట నిల్వజాలవు. సంసారంలో బంధింపబడిన తరువాత అట్టి భావములు తరచు నిర్మూలం కాగలవు. అందువల్ల విద్యార్థి దశ యందు ఆచరణ ద్వారా సద్గుణములను పోషించుకొనుట వుత్తమము. దీనిని ముందుకు నెట్టివేయుట మంచిది కాదు.

విద్యార్థులు సంపత్తిదాన యజ్ఞమందు యే విధముగా సాయపడగలరనే ప్రశ్న మిగిలియున్నది. వారు చేసే సెలవులో నుంచి కొంచెము తగ్గించి సంపత్తిదాన సంకల్పము చేయగలరు. స్కూలు, కాలేజీల ఖర్చు చాల యెక్కువైనది. అయినప్పటికి సాదాజీవనం గడుపుకుంటూ మితవ్యయం మీద ఆధారపడ వచ్చును. అందువల్ల విద్యార్థులు తమ అధ్యయన కాలమందు చేసే వ్యయంలో అల్పతమ భాగమును సంపత్తిదానముగా యీయవచ్చును. రూపాయలో రెండు పైసలు యివ్వగలరు. యిప్పుడుగూడా అక్కడక్కడా విద్యార్థులు క్షామము, తుపాను, వరదలు వగైరా సంకటములందు కొద్దిగానో, గొప్పగానో సహాయపడుతూనే వున్నారు. ఇతర పేదవిద్యార్థులకు కొంచెము సాయపడుతూ వుంటారు. కాని యీ పని అప్పుడప్పుడూ నైమిత్తికంగా జరుగుతూ వుంటుంది. ఖర్చులో ఒక భాగమును యీ విధముగా నియమిత రూపంలో దానము చేయుట జీవితంలో ఒక అంగముగా కావలెనని మన కోర్కె. విద్యార్థి దశలోని అలవాటు వలన తదుపరి ఆదాయంలో యథోచితముగా ఒక భాగమును దానముచేయుట అను పరిణామము సహజంగా రాగలదు.

## యజ్ఞముల ఉద్దేశ్యములు : అహింసాయుత సమాజము

భూదాన-యజ్ఞమునకు తరువాత సంపత్తిదాన యజ్ఞము ఆరంభమైనది. శ్రమదాన యజ్ఞమనే నినాదముకూడా ప్రతిధ్వనించు చున్నది. బుద్ధిదాన యజ్ఞము కూడా అప్పుడప్పుడు వినవస్తున్నది. జీవనదాన యజ్ఞము కూడా వచ్చిపడినది. యివన్నీ పరస్పరం భిన్నములా? జీవనదాన యజ్ఞవిషయము కొంచెము ప్రత్యేకము. మిగిలినవి యేకవస్తువుయొక్క భిన్న రూపములు. వీటిలోనుంచి యే ఒక్కటిగాని లేక అన్నీ కలిసిగాని అంతిమ లక్ష్యమును సాధించజాలవు. అవి సాధన మాత్రములు. మరి సాధ్యమేది? పూర్వకాలమందు మానవ సమాజములో శాంతి సౌఖ్యముల కొరకు అనేక ప్రయత్నములు జరిగినవి. వాటివలన ఆ యా సమయములందు కొంతవరకు లాభము కలిగినది. అయిననూ సంతోషించదగిన స్థితి ప్రాప్తము కాలేదు. అందుకొరకు నేడు ప్రయత్నము జరుగుచున్నది. భవిష్యత్తునందు గూడా యీ ప్రయత్నము జరుగుచుండగలదు. అనేక దేశములందు హింసపై ఆధారపడి నూత్న సమాజ నిర్మాణయత్నము జరిగినది; జరుగుచున్నది. కొన్ని దేశములందు శాసన పూర్వకంగా యీపని జరుగుచున్నది. నిజం చెప్పవలెనంటే, సమాజ మెట్లుండవలెననే విషయముపై కొంత స్పష్టముగానూ, కొంత అస్పష్టముగానూ చిత్రమైన అభిప్రాయములు చలామణిలో వున్నవి. కొందరి అభిప్రాయంలో సమాజమందు శోషణ వుండరాదు, శాసనము అతి స్వల్పముగా వుండవలెను. వీలున్నంత వరకు వ్యక్తి విశేషముగా స్వతంత్రుడై, స్వావలంబియై వుంటూ ఆత్మ వికాసమును పొంది శ్రమనిష్ఠ గలిగి యుండవలెను. అనగా ఆర్థిక సామాజిక సంకటములు తొలగవలెను. స్వార్థముయొక్క స్థాన

ములో పరార్థము రావలెను. స్పర్థకు మారుగా సహకారము పెంపుగావలెను. ఏక కుటుంబమందు పరస్పరం సోదర భావంతో వుంటూ వున్నట్లే సమాజమంతటా వ్యవహారము నడువ వలెను. అట్టి సమాజమును సర్వోదయ సమాజమనీ, అహింసా యుత సమాజమనీ అంటారు. దానినే గ్రామ రాజ్యమని కూడా అంటారు. అయితే అట్టి సమాజము నిర్మాణము కాగల మార్గ మేది? సమాజము వ్యక్తులవలన కలుగుచున్నది. వ్యక్తి అనగా మానవుడు మార్పు జెందకపోతే, భౌతిక పరివర్తనద్వారా శాశ్వతమైన శాంతి సౌఖ్యములు ప్రాప్తించగలవా? యెవరివద్ద భౌతిక పదార్థము లున్నవో, అతనియందు సంస్కరణ సంభవం కానిదే, అట్టి పదార్థముల వినియోగము సమాజ క్షేమము కొరకు కాగలుగుట సంభవమా? హింసద్వారా, శాసన రూపేణా కేవలము భౌతిక పరివర్తనము కావచ్చును, కాని మానవ హృదయము పరివర్తన పొందుట వేరే విషయము. అహింసక సమాజమును నిర్మించుట కొరకు మానవుని హృద యము చక్కగా పరివర్తన పొందుట చాలా అవసరము. అనగా ఆ ఉద్యమమందు మానవత్వమను మూల్యమునకు ప్రాధాన్య ముండవలెను. భూదానమువంటి యజ్ఞములు అట్టి సమాజ నిర్మాణము వైపునకు వ్యక్తులను మరల్చుతూ, వారి హృదయ పరివర్తనమునకై ప్రయత్నము జేయుచున్నవి. యిది చక్కని మార్గము. యింకను యిందుకొరకు అనేకం చేయవలసి వున్నది. కాని యీ యజ్ఞములు నడువనిదే నవ సమాజ నిర్మాణం యొక్క వుద్దేశ్యము సఫలమగుట బహుకష్టము.

## ఇది సంభవమా ?

అయితే అట్టి సమాజనిర్మాణము స్వాభావికమా, అట్టిది సంభవమా అని పలువురు ప్రశ్నిస్తున్నారు. వేలకొలది సంవత్సరములుగా అనేకమంది మహాపురుషులు యిందుకై ప్రయాస పడిరి. సర్వ మతోద్ధారకులు యిట్టి ప్రయత్నము గావించిరి. కాని వారు కృతకృత్యులు కాలేదు. ఇంతమందిగల సమాజము, అందులోని వారంతా సోదర భావంతో వ్యవహరించే రీతిగా, ఎన్నటికైనా సంస్కరింప బడగలదా ? నలుగురికీ సంగతి సందర్భములు తెలియ జెప్పినంత మాత్రమున శుభమైన పరివర్తనము సాధ్యమా? సంపత్తిదాన యజ్ఞములో అధిక సంఖ్యాకులు చిత్త శుద్ధితో సాయపడెదరా? రచనాత్మక కార్యకర్తలైన వారికి యిట్టి సంశయములు కలుగుట సంభవము. లోన సంశయము వుంచుకొని పని ప్రారంభిస్తే యీ మహాకార్యమునకు అవసరమైన వుత్సాహాతిరేకము మనయందు గలుగదు. అందువలన యీ విషయమును గూర్చి ఆలోచించుట అవసరము. ఈ పని సులభము కాదని మనము చక్కగా యెరుగుదుము. కాని, యే మహోద్దేశముతో యీ యజ్ఞములు నడుపబడుచున్నవో అవి సిద్ధి పొందుట సమాజమునకు యోగ్యమా కాదా అను విషయమును మొట్ట మొదట మనము చర్చించవలెను. యోగ్యమైన యెడల, అందుకొరకు నిండుమనస్సుతో రంగములోనికి దిగుట పురుషార్థము. పని యెంత కఠినమో అంత అధికమైన ప్రయాస దానికొరకు పడక తప్పదు. ప్రయాసకు వెరచి పనిని వదలుట మానవునికి శోభ నివ్వదు. అంతేగాక సర్వోదయ స్వరూపము సాకారము కాకున్నప్పటికి, యీ యజ్ఞముల వలన విశేషముగా లోకకళ్యాణము కాగలదు. ఇందువలన వీటిని సఫలము చేయుటలో యెంతమాత్రమూ సంకోచము వుండరాదు.

## అసంభవం గాదు

ఇంకొకమాట. మహాపురుషుల ప్రయాస వ్యర్థముకాలేదు. మానవ సమాజము వారికి చాల రుణపడియున్నది. దానాచారము వారు మనకు నేర్పకపోతే, మనస్థితి యెట్లుండెడిది? వారు మనలను కొంతదూరముచేర్చి, అక్కడినుంచి వెలుగుబాటను చూపి ముందుకు మార్గదర్శన మిచ్చిరి. వారి హితోపదేశమును నేడు మనము మనభాషలో అన్వయము చేసికొనవలెను. వారు మనకు ఆధ్యాత్మికదృష్టితో వుపదేశించిరి. మానవుని సంస్కరించుటకూ, వానికి నీతిసిగరపుటకూ మూలధారము ఆధ్యాత్మికము గదా! కాని, నేటి సమాజము మరింత క్లిష్టమైనది. అందుచేత వ్యావహారిక దృష్టినికూడా మనము ధ్యానమందుంచుకొనవలెను. 'ఈశావాస్య మిదం సర్వం' అనువాక్యముసత్యమే. కొన్ని మత ధర్మప్రచారములందు, తనకున్నదంతా ఈశ్వరునికి అర్పితం కావలెనని బోధింపబడుచున్నది. అయితే యిక్కడొక ప్రశ్న వుదయిస్తుంది. ఈ జగత్తులో ఈశ్వర ప్రతినిధి యెవరు? నన్ను నేనే ఈశ్వరునికి ప్రతినిధిగా యెంచుకొని; నా యిష్టమువచ్చినట్లు నా సంపత్తిని తదితరమైన వస్తువులను వుపయోగించ కూడదా? నన్ను కాదనగలవారెవరు? వస్తుతః ఈశ్వరునికిగల నిజమైన ప్రాతినిధ్యము సమాజమువైపునకు మరలుట అవసరము. మనవద్ద వున్నదంతా సమాజకృపచేత లభ్యమైనది గనుక దాని లాభము సమాజమునకు చెందవలెనని మనము తెలుసుకొనవలెను. ఇది కేవలము కల్పించి చెప్పేమాటగాదు, వస్తుస్థితి. ఈ చిన్నపుస్తకమందు యీ తత్వమును తెలియజేయుటకే ప్రయత్నము జరుగుచున్నది. అందరియందును సమభావము వుండవలెనని మహాపురుషులన్నారు. దాని వెంటనే వ్యక్తి తన కర్మానుసారము

దుఃఖమును అనుభవించక తప్పదనికూడా అన్నారు. వాస్తవంగా అనేక సంకటములు, కష్టములు మానవ నిర్మిత సామాజికవ్యవస్థ ద్వారా కలుగుచున్నవి. మానవ ప్రయత్నముచేత అట్టి స్థితి యందు పరివర్తనము కలుగుట సాధ్యమని అందరూ గుర్తించ వలసిన సమయము వచ్చినది. కారణమేమనగా సుఖము కలిగిన యెడల అందరూ దానిని పంచుకొనగలరు. కష్టము కలిగిన యెడల అందరూ దానిని అనుభవించక తప్పదు, యిది న్యాయ మైనపద్ధతి. అంతేగాని కొందరు సుఖభోగులై, కోట్లకొలది మంది కష్టజీవులై వుండుట న్యాయముకాదు.

అయితే మానవుని స్వార్థవృత్తి ప్రబలమై దానిని సంస్క రించుటకు కేవలము వ్యక్తి అధీనంలోని ప్రయత్నమే శరణ్యమైతే, యీ దుర్గుణము నిర్మూలమవుతుందని విశేషముగా మనము ఆశించకపోదుమేమో! మనుష్యుని మానవత్వముమీదనే మనము విశ్వాసమును వుంచవలసి యుండును, కాని సమాజమును వీలై నంత త్వరగా సంస్కరించవలసియున్నది. మన ప్రయత్నంలో అధికాంశం యిదియే. ఈ దృష్టితో ఒక విషయమును మనము ధ్యానమునందుంచుకొనవలయును. మానవసంస్కారము కొంత భాగము తన వివేకముచేత, కొంతభాగము సమాజము అంగీక రించిన తత్వ ప్రభావముచేత జరుగుచున్నది. కొన్నిజాతులలో దొంగతనముచేయుట దోషముకాదు, మిగిలిన సమాజమంతటా అది దోషము. ఆ యా మానవ సమూహములు అంగీకరించిన తత్వములనుబట్టి యీ గుణదోషములు కలుగుచున్నవి. యిది వరకే చెప్పినట్లుగా సంపత్తినిగూర్చి, విద్యనుగూర్చి సమాజములో తత్వము మారినయెడల వాటి వుపయోగము సమాజ క్షేమం కోసం జరుగుట చాల సంభవము. ప్రపంచములోని సగభాగము సామ్యవాదమయమై (కమ్యూనిజంతోనిండి) యీ తత్వమును

అంగీకరించినది. పెట్టుబడిదారీ ప్రపంచం సైతము కల్యాణకారి యగు రాజ్యతత్వమును స్వీకరించినది. అట్టి రాజ్యమందు అందరికి సర్వసాధారణమైన అవసరములు లభించగలవు, ఎవరికీ కష్టము వుండదు. జగత్తునందు వీచే యీ గాలిచేత అస్పృశ్యంగా భారత దేశం యెట్లుండగలదు? భారతదేశమందు నూటికి తొంభై మంది దారిద్ర్యంలో వున్నారు గనుక యీ తత్వము దృఢముగా నాటుకొనిపోవుట కఠినముగాదు. ఆ పేదలు తమ హక్కును గూర్చిన భాషను నేర్చుకుంటునేవున్నారు. తమ కర్తవ్యమును గూర్చిన భాషనుగూడా నేర్చుకొనవలసియున్నది. యజ్ఞమందు సాయపడుటకు, పేదరికమువలన తాము ప్రత్యక్షముగా చేయగల ఆర్థిక త్యాగము అల్పమైనను, దాని మహత్వమును వారు తెలుసుకొనుట అవసరము. తాము కొంచెముగూడ త్యాగము చేయక కేవలము శ్రీమంతులనే త్యాగము చేయమనుట ఒప్పు కాదు. అందుకనే పేదలుగూడా యీ యజ్ఞములలో చేరవలెనని నొక్కి చెప్పడమైనది.

తత్వమందు గొప్ప శక్తిగలదు. సమాజములో అధిక సంఖ్యాకుల తత్వజలరాశి సరియగుదిక్కునకు ప్రవహించినయెడల సమాజపరివర్తనమందు సంశయము వుండనక్కరలేదు. కాని యీ ప్రక్రియలో యెంత సమయం పడుతుంది? యెంతవరకు నిబ్బరముగా వుండగలము? క్రాంతి యీ విధముగా మందగతితో నడువదు. హింసద్వారా లేక శాసనంద్వారా కార్యము శీఘ్రంగా అవుతుందా? ఈ రెండువిధములైన ప్రక్రియలందు చాల సమయం కాగలదని అనుభవపూర్వకంగా తెలుస్తున్నది. యిక మానవుడు వ్యక్తిగతంగా యెప్పటికప్పుడు మంచిగా చెడుగా మార్పుచెందటం వేరేవిషయం. ఈ కాలంలో అభిప్రాయములలో పరివర్తనము చాల వేగంతో జరుగుచున్నది. దూరదేశములు

వద్దకొచ్చినవి. పూర్వం ఒక నూరు సంవత్సరములలో అయ్యే పనులు యిప్పుడు పది పదిహేను సంవత్సరములలో కాగలవు. వెనకటి హయాంలో ప్రక్రియ అధికంగా వ్యక్తిగత రూపంతో వుండేది. యిప్పుడు సామూహిక రూపంలో కావలెను. సమాజములో బహుజనాభిప్రాయము సంకటంవుండరాదని, సమానత్వం కావాలనే ధోరణిలో వుంటున్నది. శాసనమునకు యిందు మూలాన వ్యతిరేకభావంలేదు. బహుజన మానసం మారితే శాసనం సఫలమవుతుంది. అందువలన తెలియజెప్పి, యజ్ఞ రూపంలో ఆచరింపజేసి సమాజమును మార్చే ప్రయత్నము జరుగుచున్నది. హింసద్వారా లేక శాసనంద్వారాగాక భౌతిక పరిస్థితిని, మానసమును మార్పించుటకు ప్రజలవద్ద వేరొక వుపాయములేదని భావించుట తప్పు. హింసయొక్క స్థానమును సత్యాగ్రహము ఆక్రమించగలదు. దానివలన భౌతికస్థితితో బాటుగా మనుష్యుని మానసమునుకూడా మార్పుచేయవచ్చును. ఈ విషయము మహాత్మాజీ ప్రయోగముజేసి మనకు రుజువు పరచెను.

భారతదేశమందు నేడు జనతంత్రాత్మక రాజ్యాధికారము నడుస్తున్నది. వేరువేరు పార్టీలవారు తమతమ అభిప్రాయములను ప్రజలకు తెలియజేసి వారి మానసమును మార్పు జేయ గోరుచున్నారు. యిది మన రాజ్యాంగపు విధానము. యీ ప్రక్రియ గూడా వాస్తవానికి ప్రజల మనస్తత్వమును మార్చుటకు వుద్దేశింపబడినది. కేవలం శాసనం చేయుటంకాదు.

పైన వివరించిన సంగతులవలన గంభీరమైన ఈ తత్వమును కార్యకర్తలు చక్కగా తెలుసుకొనవలెను. మహాత్మాజీ, వినోబాజీ తెలియజేసిన మార్గము ననుసరించి తమ వుద్దేశ్యములు నెరవేరగలవని వారు విశ్వసించగలరు. ఇది న్యాయసమ్మతము,

యుగధర్మము. దీనికిక యెదురులేదు. అహింసాయుతమార్గము శుభప్రదమైనది.

## వ్యక్తిగత యాజమాన్యము

పైన చెప్పినట్లుగా తత్వపరివర్తనము అవసరము. వ్యక్తిగతమైన సంపత్తియొక్క యాజమాన్యపు హక్కులో ఆమూల పరివర్తనము కావలసియున్నది. ఆలోచించి చూచినట్లయితే, ధన సంపాదన సంగతి అట్లుంచినా, సమాజంయొక్క సహకారం లేనిది మనుష్యుడు జీవించిగూడా వుండలేడు. తన పురుషార్థము విషయమై గర్వపడేవారు అడవిలోకి వెళ్ళి ఒంటరిగా వుండి జీవిస్తే సంగతి తెలుస్తుంది. మనుష్యుడు సమాజంలో వుంటాడు; అనగా మనుష్యులు పరస్పరం సాయపడెదరు. అప్పుడే మనుష్యుని జీవనం గడుస్తుంది. పేదయైన కష్టజీవికి యజమాని యేదో ఒక పని చూపుతాడు. ఆ కష్టజీవికి కడుపు నిండుతుంది. కష్టజీవి సహాయంవల్ల యజమాని పని జరుగుతుంది. వ్యాపారికి యెవరైనా వచ్చి వస్తువులమ్ముతారు. వానివద్ద కొందరు వస్తువులు కొంటారు, యీ విధంగా వ్యాపారం సాగుతుంది. కార్ఖానాలలోగూడ అనేక రకాలైన మనుష్యులు సహకారం చేస్తారు. అప్పుడే కార్ఖానా నడుస్తుంది. జబ్బుల వలన డాక్టర్లపని జరుగుతుంది. సంపత్తికోసం కలహిస్తే వకీళ్ళ పని జరుగుతుంది. ఈ విధంగా అన్ని వృత్తులు పరస్పర సహకారంచేత నడుస్తున్నవి. మనుష్యుని పోషణ జరుగుచున్నది. నా శరీర బలము, బుద్ధిబలము, సంపత్తిబలము సమాజము మీదనే ఆధారపడివుంటే, వాటిమీద కేవలం వ్యక్తిగత యాజమాన్యము లేక అధికారము చెల్లుట న్యాయ సంగతమని నే నెట్లనగలను?

మన స్వార్థవృత్తి మనలను ఇంకోవైపుకు ఈడ్చుకొని పోనిపక్షంలో ఈ నిర్ణయమునకు వచ్చుట సులభమే కాగలదు. అది యేమనగా, అవసరంకంటె ఎక్కువ ధనమును సంపాదించుట, అవసరం కంటె ఎక్కువ సంపత్తి మీద వ్యక్తిగత యాజమాన్యమును వహించుట ఉచితము కాదు అనే నిర్ణయం. సంపత్తిపై యాజమాన్యమును సమాజహితం కొఱకు విసర్జించుట అనగా, అట్టి సంపత్తి ఉపయోగము, దానివెంట మన బుద్ధియొక్క ఉపయోగము సమాజమునకు చెందుట, ఇది సిద్ధాంతము. ఇది న్యాయసమ్మతమైన కోర్కె. ఇప్పటి చట్టం ప్రకారం, సామాజిక సాంప్రదాయం ప్రకారం అంగీకరించబడే వ్యక్తిగత యాజమాన్యము నందు పరివర్తన జరుగుట అవసరము. అనగా అధికమైన సంపత్తి వ్యక్తికి చెందక, సమాజ శ్రేయస్సు కొరకు వుండవలెనని మనం తీర్మానించు కొనవలెను.

## కొన్ని తెలియని సంగతులు

సంపత్తిదాన యజ్ఞము చర్చకు రాగా, సర్కారువారికి తాము అధికంగా పన్ను చెల్లిస్తామని, దాని వుపయోగము ప్రజాహితము కొరకే జరుగు చున్నదని ధనికులు అనడం కద్దు. దానిని ఒక విధమైన సంపత్తిదానముగా యెందుకు భావించరాదు అని కూడా వారంటారు. ఇదే ప్రకారముగా యింకొక చర్చగూడా జరుగుతూ వుంటుంది. సర్కారువారి ఆర్థిక విధానమునకు ప్రతి ద్వంద్విగా సంపత్తిదాన యజ్ఞము వుంటున్నదని ఆ చర్చయొక్క తాత్పర్యము. సర్కారువారి పన్ను విధింపు వలన ధనికుల ఆదాయము తగ్గుచున్నది. అట్లే సంపత్తి దానము ద్వారా జరుగుతున్నది. అందువలన యిది ద్వంద్వ విధానము. అందుచేత సంపత్తిదాన యజ్ఞమును నడుపుట వుచి

తము గాదు. ఈ వాదనకు సమాధానము కలదు. యజ్ఞము యొక్క సరియయిన అర్థము తెలియనందున యిట్టి ఆక్షేపణలు జరుగుచున్నవి. సర్కారువారికి చెందే పైసలు సంతోషము చేత గాక జబర్దస్తీ ద్వారా లభిస్తున్నవి. వీలైనంత మిగిలించుకుందామని పన్ను చెల్లించేవారు చూస్తూంటారు. ఆర్థిక వ్యవస్థలో శుద్ధికి బదులు కల్మషం వ్యాపిస్తున్నది. భూదాన సంపత్తిదాన యజ్ఞములు కేవలము భౌతిక పదార్థములను చేతులు మార్చే సాధనములనిమాత్రమే భావించినందువలన పైన వివరించిన ఆక్షేపణలు కలుగుచున్నవి. వాస్తవముగా యీ యజ్ఞముల వుద్దేశ్యము అట్టిది గాదుగదా! దాని వివరమంతయు యింతవరకు మనము చూచినదేగదా.

---

## నాల్గవ భాగము

# సంపత్తి దానం ఎంత చేయవలెను? దాని ఉద్దేశ్యమేమి?

మన కుటుంబంలో అయిదుగురున్నారనుకొందాం. దరిద్రనారాయణుని రూపంలో మరొకరు మన కుటుంబంలో చేరినా డనుకొనవలెను. ఈ విధంగా సంపత్తిదానములో కనీసం ఆదాయంలో ఆరవ భాగాన్ని ఈయవలెను. ఇది ఒక సంవత్సరం ఇచ్చి ఊరుకునేదికాదు. జీవితమంతా ఆ ప్రకారం ఇస్తూపోవాలి. ఎందుకంటే జీవితాంతం సంపత్తిని మన వద్ద ఉంచుకున్నట్లైతే, లేక జీవితాంతం సంపాదిస్తునట్లయితే, మొదట చెప్పినట్టు—సమాజంద్వారా అది లభ్యం అయినందువల్ల దానిపైన సమాజానికి హక్కు ఉంటున్నది.

జీవితాంతం సంపత్తిదానం ఇస్తూఉండటం భారం అనిపించే అవకాశమున్నది. కాని ఇది అంతఃకరణ శుద్ధికి సంబంధించిన విషయం. మన జీవితాలను సంయమ పరచటంలో ఇది సహాకరిస్తుంది. ఇందులో స్వయంగా తమ ప్రేరణద్వారానే తమ మీదే నియంత్రణం ఏర్పడుతుంది. ఇది లేనందువల్ల సమాజంలో జరుగుతున్న విధానాల్ని రోజూ మనం చూస్తూనే ఉన్నాం. కోటి సంపత్తిగల వాడు దాన్ని రెండుకోట్లు చేసుకోడానికి నిరంతరం తాపత్రయపడుతున్నాడు. సాధన శుద్ధి గురించిన ఆలోచన, అరుదుగానే జరుగుతోంది. ఇంతగా ధనం సంపాదించవలసిన అవసర మేమున్నది? ఈ ధనాన్నంతా ఏం చేయాలె? ఇందులో స్వంత లాభం ఏమన్నా ఉన్నదా లేదా? ఈ విషయాలను ఎంతమంది

ఆలోచిస్తున్నారు? తమ తమ పనుల్లో నిమగ్నులు కావటంవల్ల ధనికులకు దేశసేవకోసం తీరికలేదు. బీదలకు పొట్టకోసం పాట్లు పడటంలో— అవకాశమే లేదు. ఇక మధ్యమ తరగతి వారు పెరుగుతున్న ధరలతో వేగలేక పోతున్నారు. దేశసేవ కోసం ఈ వర్గాలనుండి కాక ప్రత్యేక వ్యక్తుల వర్గం ఏమైనా ఉన్నదా? మరోచోటినుంచి దేశసేవ కోసం వ్యక్తులు పుట్టుకొని వస్తారా? ఈ పరిస్థితుల్లో మనం ఏవిధంగా పురోగమించగలం? అందరికంటే అవకాశాలు కలిగి ఉన్నవారు వాస్తవానికి ధనికులు. వారి కుటుంబాల్లో చాలామంది ఉంటారు. అందులో కొందరు వ్యవహారాల్ని చక్కబెట్టుకోగల సమర్థులు. అట్టివారు తమ ధార్మిక పరంపరానుసారంగా, సమయానుకూలంగా వానప్రస్థాశ్రమం స్వీకరించి, బీదల సేవలో నిమగ్నులు కావాలి. కాని ప్రపంచంలో ఇవాళ ధనదాహం ఎంత తీవ్రంగా ఉన్నదంటే, చచ్చేదాకా మన మీ బంధనాల్నుంచి విముక్తులం కాలేక పోతున్నాం.

## సంపత్తిదాన సామయికత

[ సంపత్తిదాన వినియోగానికి సంబంధించి వినోబాజీ మరియు సర్వసేవా సంఘం ద్వారా నిర్ణయించబడిన మూడు ఉద్దేశాలను జాజూజీ పేర్కొన్నారు. 1. భూమిహీనులకు సాధన సామగ్రి, 2. కార్యకర్తల నిర్వహణ, 3. సత్సాహిత్య ప్రచారం. కాని తర్వాత అప్పుడప్పుడూ, సిద్ధాంత విమర్శల తర్వాత ఈ ఉద్దేశాల్లో సవరణలు కూడాచేయబడినవి. ఆమోదింపబడిన దాని అంతిమ రూపం కోసం "సంపత్తిదానమును గురించి తెలుసుకొన వలసిన సంగతులు" అను మూడవ అనుబంధములో చూడుడు. ]

ధనికులు ఏదోకొంత దానం చేస్తూనే వుంటారు. కొంత మంది తమ ఆదాయంలోని ఆరవ భాగంకంటె ఎక్కువే చేస్తుండ

వచ్చు. కాని ఈ దానం స్వంతప్రేరణ మీద కాక, పరప్రేరణ మీద ఆధార పడినదై ఉంటున్నది. ఏ ఉద్దేశ్యం కొరకు దానం చేస్తున్నారో, ఆ ఉద్దేశం తమకు ఇష్టం లేక పోయినా, కొందరు ప్రముఖులైన వ్యక్తులు దానానికివస్తే కాదన లేక మొహమాటానికి దానం చేయటం జరుగుతుంది. ఈలాంటి దానం తీసుకునే వారికీ ఇచ్చేవారికీ అప్రియముగానే ఉంటుంది. కాని దీనికి బదులుగా ప్రతి సంవత్సరం ఆదాయంలోని ఒక చిన్న భాగం దానం చేయాలనే నియమం పెట్టుకుంటే, ఏఏ పనులు తన దానానికి అర్హములో వాటిని దాత స్వయంగా ఆలోచించుకునే అవకాశం ఉన్నది. తనకు ఇష్టమైన పనికోసం తానే ఆలోచించి తన దానపు మొత్తంలోనుంచి ఖర్చు పెట్టడమే కాక తన కిష్టమైన కార్యం సఫలం కావటాన్ని చూడగలుగుతాడు. కొంతమంది వర్తకుల్లో ఒక నియమముండుంది. తమ ఆదాయంలోని ఒక నిశ్చితభాగాన్ని దాన ధర్మాలకోసం ప్రతి సంవత్సరం తీసి వేరుగా పెడతారు. కొందరు జైన సోదరులు ఒక చిన్న మొత్తం నిర్ణయించుకుని అంతకన్నా ఎక్కువ సంపాదించ కూడదనే వ్రతాన్ని కూడా పూనుతారు. ఇలాంటి పద్ధతులనే సంపత్తిదానము విస్తరింప చేయ నుద్దేశిస్తున్నది.

ఒక విషయంమాత్రం బాగా గుర్తుంచుకోవలసియున్నది. పురాతన పద్ధతిలో సంపత్తిమీద స్వామిత్వపు హక్కు గుర్తించబడి, దయాధర్మం రూపంలో ఇతరులకు సహకరించాలనే విషయం ఉండేది. కాని దీనికి భిన్నంగా సంపత్తిదాన యజ్ఞంలో, సంపత్తిపైన స్వంతస్వామిత్వాన్ని ఒప్పుకోకుండా, సమాజ స్వామ్యాన్ని ఒప్పుకుని, దాన్ని ఖర్చుచేయవలసియున్నది. పురాతన పద్ధతిలో అది సమయానుకూలంగా ఉండజాలకపోవటమనే పెద్ద దోషం ఉండెను. దేశకాల పాత్రముల ననుసరించి చేయబడేదే సాత్త్విక

దానము. సంపత్తిదాన యజ్ఞానికి వినోబాజీ చెప్పిన ఉద్దేశ్యములు, దేశపు వర్తమాన పరిస్థితులకు చాల ఉపయుక్తముగా ఉన్నవి. ధనికులు ఇంతవరకూ ఇస్తూ వస్తున్న దానంవల్ల ముఖ్యంగా నగరములలో ఉండే మధ్యతరగతి ప్రజలు లాభపడేవారు. కాని వాస్తవానికి అత్యంత బీద ప్రజానీకానికి దానంద్వారా లాభం కలగవలెను. ముఖ్యంగా నూటికి 80 వంతులున్న మన గ్రామీణ ప్రజానీకం వద్దకు ఈ దానాలు చేరవలెను. జ్ఞాపకముంచుకోవలసిన మరొక విషయమేమిటంటే, ఎవరికైతే దానం లభిస్తుందో అతను పనిదొంగ కాకుండా, పనిలో నిమగ్నుడై తన బ్రతుకు తెరువుకు శాశ్వతమైన సాధన సంపాదించుకొని సగౌరవంగా బ్రతకాలి. భూదాన యజ్ఞము మరియు సంపత్తిదాన యజ్ఞముల ద్వారా ఈ విషయం సుసాధ్య మౌతున్నది.

---

అనుబంధము - 1

# సంపత్తిదానముపై పళనిలో జరిగిన చర్చ

## (వినోబా)

ఇంతవరకు మనం చూచిన దానిలో అంతా సత్యమే అనిపిస్తున్నది. నగరములలో ఉండే చిన్న చిన్న వ్యక్తులు లేక సాధారణ వ్యక్తులు ఇచ్చే సంపత్తి దానమునకు ఎక్కడో చాలా దూరాన వినియోగం జరుగుతుంది. కనుక దాతలు దాన్ని దర్శించ లేరనే విషయం వివరించబడినది. అందుకని సంపత్తిదానము దర్శన క్షేత్రంలోనే వినియోగింపబడాలి. నాకు ఇది అత్యంత మౌలిక సిద్ధాంతంగా తోస్తున్నది. దర్శన క్షేత్రంలోనే ఉపయోగం జరిగినప్పుడే అట్టి ఉపయోగపు అసలు విలువ తేలుతుంది. దానివల్ల ఉత్సాహం కూడా కలుగుతుంది.

ఈ ప్రణాళికంతా, క్రాంతి వైపుకు నడవటానికి— అంటే ఆ వైపుకు పురోగమించడానికి, మన వద్ద ఉండే అంకుశాన్ని మనం వదలకూడదని నారాయణభాయి అన్నారు. ఇది మనకు సత్యంగానే తోస్తున్నది. సంపత్తిదానం నిరంకుశంగా ఉపయోగ పడితే ఇష్టకార్య సిద్ధి దానివలన సాధ్యపడదు. దాత శ్రద్ధాభావంతో ప్రేరితుడౌతాడు. కనుక అయిష్టుడు కాకపోవచ్చు. అందుకని ఏదో ఒక మంచి పనే అతను చేస్తాడని మనం విశ్వసిస్తాం. కనుక అయిష్టత అనేది ఎక్కువగా లేకపోయినా ఇష్టము కూడా ఎప్పుడూ ఉండదు.

ఈ విషయం వాస్తవమే.

మన అంకుశం 'అహింసాత్మకం' కావాలని అంటే అది ఆజ్ఞాపూర్వకం కాకూడదని శంకర్రావుజీ అన్నారు. మనం మన సిద్ధాంతాల్ని వివరించాలి. ఆ దాత విచక్షణాశక్తికి దాన్ని వదలాలి.

అతను ఎంత గ్రహిస్తే ఏ విధంగా గ్రహిస్తే ఆ విధంగానే చేయనివ్వండి. ఈ స్వాతంత్ర్యాన్ని మనం ఇవ్వటం లేదంటే, మనల్ని మనమే ఖండించుకుంటున్నా మన్న మాట. అంటే అహింసా సిద్ధాంతాన్ని ఖండిస్తున్నా మన్న మాట. క్రాంతినే ఖండిస్తున్నా మన్న మాట. శంకర్రావుజీ 'అహింసాత్మకం' అనే శబ్దాన్ని 'ఆలోచనాత్మకం'( वैचारिक ) అనే శబ్దంగా అనువదించారు. అహింసయొక్క ముఖ్య స్వరూపం ఆలోచనాత్మకమే. అందుకని మనం సిద్ధాంతాల్ని వివరించుదాం. సిద్ధాంతాల్ని వివరించటం వలననే మనం కృతకృత్యులమౌదాం. సిద్ధాంతాలని వినటంతోటే అతను కృతకృత్యుడౌతాడు. ఆ తర్వాత అతనికి తోచినట్లు చేస్తాడు. ఇందులో అహింసకు స్థానం ఉన్నది. ఇది అత్యంత మౌలికమైన సిద్ధాంతంగా నాకు అనిపిస్తున్నది.

అప్పాసాహెబ్ అన్నమాట మరోవిధంగా ఉన్నది. ఆయనేమంటారంటే, మనం దాతను ఆదేశిస్తూ 'అయ్యా, సమతవైపు తీసుకుపోయేదే ఏదైనా చెయ్యి.' అంటే చేసే ప్రతి పని పైఉద్దేశం మూలంగానే ప్రేరితమైంది కావాలి. నా వద్ద లక్షలకొలది రూపాయలు పడివున్నాయి. అందులో కొంత నేను దానం చేస్తాను. ఈ పని ఏదో ప్రత్యేక ఉద్దేశాన్ని అర్థం చేసుకొని చేసిందికాదు. దుఃఖ నివారణమౌతుందని విశ్వసించి చేయబడింది. ఈ మాత్రం చేయటంతోటే మన పనికాదు. దుఃఖనివారణోద్దేశం చాల గొప్ప ఉద్దేశమే కాని ఇందాకే చెప్పినట్టు అదే మన ఆశయం కాదు. దుఃఖనివారణమైతే అది మనకు అయిష్టము కూడా కాదు. దుఃఖనివారణము మాత్రమే కాకూడదనేది మన ఇష్టకార్యము. అది విషమత్వంలోనుంచి అవుతుంది. అందుకని సమతా సిద్ధాంతానుసారంగా దాత దానాన్ని వినియోగించాలి. ఆయన ఒకమాటన్నారు. అనేక విషయాల్లో ఖర్చు పెట్టటం కంటే భూదానానికే ప్రథమంలో సహాయం చేయాలని. ఇది బాగుంటుందనే నేనూ అభిప్రాయ పడుతున్నాను. సాధకులమైన మన

మందరమూ ముఖ్యంగా దాని సాధనే చేస్తున్నాము గదా! మన ఆవశ్యకత సమాజానికి ఎల్లప్పుడూ ఉంటుంది. అందుకని సంపత్తి దానం ఇచ్చేవారు 'వీరి పనిలో మనం సహాకరిస్తే ఎక్కువగా సార్థక్యాన్ని పొందుతామ'ని తప్పకుండా ఆలోస్తారు. దీనికి భిన్నంగా పని చేసే హక్కు మనకు లేదని కాదు. కాని ఈ పనికి సహకారం లభించటాన్ని మనం తప్పకుండా కాంక్షిస్తూన్నాము.

ఇందాకనే కోయంబత్తూరు మిల్లు యజమానులతో మాట్లాడాను. విషయాల్ని వివరించాను. అందులో ఒకర్ని తన భాగమిమ్మని కోరాను. మీరందరూ వ్యక్తిగతంగా మీ మీ భాగాలను ఇచ్చినా నాకేం అభ్యంతరం లేదు.........కాని యజమానుల సంఘం తరపున మీ రేమన్నా ఇవ్వదలచుకుంటే మాత్రం మీ అందరి ఆమోదంతోనే అది జరగాలి. మీరు సమావేశ మౌతారు. అందులో ఇద్దరు వ్యతిరేకిస్తారు. 25 మంది అనుకూలంగా ఉంటారు. అయినప్పటికీ మీ సంపత్తి దానాన్ని నేను స్వీకరించను. ఇది విన్నప్పుడు వారు కొంచెం ఆశ్చర్యపడి వుంటారు. ప్రాప్తిమార్గంలో పెద్ద ఆటంకాన్ని పెట్టానుగదా మరి? ఏ ప్రాప్తిని నేను పొందాలనుకుంటున్నానో దాని మార్గంలో నేనే ఇలాంటి ఆటంకాల్ని పెట్టడం కొంచెం విచిత్రంగా అగుపడవచ్చు. కాని నేను వాళ్ల సంపత్తికోసం పరితపించడం లేదుగదా? కావలసింది వాళ్ల హృదయపూర్వక సహకారం. అలాంటివాళ్లే నా పనిని ముందుకు నడిపించ గలుగుతారు. లేకపోతే నాపనిని నేనే చేస్తూ కూర్చోవలసి ఉంటుంది. నా పని నాచేతినుండి ఇతరుల చేతికి అతిత్వరగా అందాలని నా కోరిక.

నాయకంగారు సహజంగానే ఒక విషయం చెప్పారు. ఈ మధ్య కొందరు యజమానులు తమ కూలీలకు బోనస్ ఇవ్వవలసిన అవసరం ఏర్పడ్డది. ఈ బోనస్ విషయంలో కొంత రభస జరిగింది. కోర్టు కార్మికుల పక్షాన్నే తీర్మానించింది. అందుకని వారికి బోనస్ ఇవ్వక తప్ప

లేదు. అందులో యజమానుల సంపత్తి చాల ఖర్చయింది. మీ "దగ్గర పనిచేసే కార్మికులకే కదా మీరు బోనస్ ఇచ్చింది. ఇది ఉచితమైందే కదా! కాని మీ కర్తవ్యం ఇంతటితో పూర్తి అవలేదు. మీకు ప్రత్తిని ఎవరు పండించి ఇస్తున్నారో మీ రాలోచించాలి. ఏ కార్మికుడు చేనులో చెమటోడుస్తున్నాడో, ఎవడు దేనికి యజమానికాడో, ఆ కార్మికుని శ్రమవల్లనే మీకు అది లభిస్తుంది. బోనస్ దృష్టితో చూచినప్పటికీ ఇది ఆలోచించ వలసిన విషయమే. మీరిచ్చిన బోనసు చాలా ఉచితమైందే. మీరిచ్చే బోనస్ మీ లాభంలో ఒక భాగమేకదా! ఈ దృష్టితో చూచినప్పుడుకూడా మీ సంపత్తి భూమిహీనుడైన ఆ రైతుకోసం ఉపయోగపడాలి. ఇది చాలా అవసరం" అని నాయకంగారు అన్నారు. చెప్పదలచుకున్న దేమంటే, ఎప్పుడైతే మన మీ పని చేస్తున్నామో, అందరమూ దీని మీదే గట్టిగా పనిచేయడానికి పూనుకున్నామో అప్పుడు మన ఆవశ్యకతను సంపత్తిదానం చేసే దాతలు గుర్తిస్తారు. తెలిసి కూడా వారు దాన్ని ఇతర కార్యములకు వినియోగిస్తే ఆప వలసిన పని మన కేమున్నది? ఏ అంకుశం లేకుండానే దాని అధి కాంశం భూదాన సాఫల్యత కోసమే ఉపయోగపడుతుందని అందరికీ తెలిసే ఉంటుందని నేను విశ్వసిస్తున్నాను.

దాదా రెండు విషయాలు చెప్పారు. మొదటిది సంపత్తి దానంలో స్వామిత్వాన్ని నిరాకరించడమే మన ముఖ్య సిద్ధాంతం గాని, దాన్ని రూపుమాపటం కాదని. దాదాపు ఇదే విషయాన్ని అప్పాసాహెబ్ తన 'సమత' పదజాలంలో చెప్పారు. ఆయనేమో సమత్త్వంవైపు పురోగమించడానికి వినియోగించాలన్నారు. ఈయ నేమో "భూదానం ఇచ్చేవారు స్వామిత్వపు.........అంశాన్ని త్యాగం చేస్తాడు — కొందరు మొత్తాన్నే ఇచ్చివేస్తారు — అప్పుడు సంపూర్ణంగా నిరాకరించడమే అవుతుంది. కాని సంపత్తిలో ఒక భాగాన్ని మాత్రమే దానమిస్తారు — ఏదో ఒక పనికి మనం వినియో

గిస్తాం. ఈ మాత్రంతోనే సామూహిక త్యాగాన్ని దాత దర్శించ జాలడు" అని అన్నారు. సంపత్తి వివిధ మార్గాలద్వారా ప్రాప్త మౌతుంది — దాని వినియోగం కూడా వివిధ రకాలుగా కావచ్చు. అందులో దురుపయోగమూ ఉంటుంది; సదుపయోగమూ ఉంటుంది. ఇదంతా ఉండటం మూలాన భూమికీ సంపత్తికీ తేడా ఉంది. అంతే కాదు, భూమికి మౌలికమైన విలువ ఉన్నది. సంపత్తికి అంటే ధనా నికి మౌలికమైన విలువ అంతగాలేదు. ఇన్ని తేడాలున్నాయి. దాదా చెప్పిన విషయాల్ని నా కర్థమైనంతవరకు చూస్తే మన పని ఎక్కడో ఆగిపోతున్నట్లనిపిస్తున్నది. "మన కార్యకర్తల బ్రతుకు తెరువు కోసం మనం కొంత సంపాదించాలి; భూమి సాగుకు సహాయ పడటానికి కొంత సంపాదించాలి" అని ఈ విధమైన వ్యాకుల బుద్ధితో మన మీ దానాంశాన్ని స్వీకరిస్తూ పోతే — ఇదొక పుణ్యకార్యమే అవుతుంది కాని, సంపత్తి దానపు మూల ఉద్దేశ్యము అయినట్టి ఆ క్రాంతియుత ఉద్దేశాన్ని మాత్రం సాధించినట్టు కాదు. అతను అన్నదంతా వాస్త వమనే నా ఉద్దేశం. ఎక్కడ మనం దానమడుగుతామో, లేక దానపు లక్ష్యాన్ని మనం ఎక్కడ వివరించ ప్రయత్నిస్తామో, అక్కడ అతని సంపత్తియొక్క పరిత్యాగము. అపరిగ్రహం వైపుకు పురోగ మించడానికి, లేక సమత్వపు మూలసిద్ధాంతాన్నంతటినీ వివరించి, అర్థం చేసుకున్న తర్వాతే, ఇవాళ ఎంత వీలైతే అంత చేయాలనే ఉద్దేశంతోనే దాదా మాట్లాడారు. ఐనప్పుడు అందులో క్రాంతి కార్య క్రమం మిగలదని నా అభిప్రాయం. కాని ఈ విషయాన్ని మనం మన ముందుంచుకోకపోతే, కార్యకర్తల ముందర ఈ విషయం ఉండకపోతే, వివరింపబడే వారికి ఈ విధంగా వివరింపబడకపోతే, మన ఉపయోగానికే దానాన్ని పొందుతూ ఉంటే, ఆ దానం, వారన్నట్లు సాధన దానముగా స్వీకరించవచ్చు. కాని దానికి సంపత్తి దాన స్వరూపం లభించదు. ఈ విషయం ఆలోచనకు సంబంధించింది.

దీన్ని మనమందరం గుర్తుంచుకోవాలని నా ఉద్దేశం. లేకపోతే మన కార్యక్రమ ఫలితం మనం కోరేదానికి భిన్నంగా జరుగవచ్చు.

ఆయన ఒక మంచి విషయం చెప్పారు. ఈ ఉద్యమంలో మన కంటే భిన్నంగా ఉన్న వారిని మనలో కలుపుకోవా లన్నారాయన. అంటే భిన్నత్వాన్ని రూపుమాపాలని. మనకు అగుపడుతున్న భిన్నత్వాన్ని దృష్టిలో ఉంచుకునే దీన్ని మనం వినియోగించాలి. కార్మికునికీ యజమానికీ, కార్మికునికీ కర్షకునికీ భేదం ఉన్నది. అందుకని కార్మికులు కర్షకుల్ని గురించి ఆలోచించాలి. కర్షకులు కార్మికుల్ని గురించి ఆలోచించాలి. కార్మికులు ఎంత బీదవారైనా, స్వయంగా ఇతరుల సహాయానికి అర్హులైనా, వారు సంపత్తి దానం ఇవ్వటానికి పూనుకున్నప్పుడు మాత్రం తమకంటే భిన్నమైన వారికి వారివ్వాలని ఆయన విచారించారు. చాలా దూరపు క్షేత్రంలో దానాన్ని వినియోగిస్తే అది ప్రేరకం కాదని, జయప్రకాశ్ జీ అన్నమాటకు ఇది విరుద్ధం కాదు. తమ దర్శనక్షేత్రంలోనే పనిచేసుకోవచ్చు — తమకు భిన్నమైన వారికి ఇవ్వవచ్చు.

ఇక్కడ ఒక విషయం చూద్దాం: 'మేమంతా కార్మికులం అనే చైతన్యం మాలో కలిగింది — మేమంతా కార్మికులం అనుకో గలిగినంత విశాలత్వం మా కబ్బింది' అనే భావం ఒప్పుకోబడినచోట, కార్మికులు ఇచ్చేదానం, వారికి భిన్నమైన వర్గానికి అంటే కర్షకులు మొదలగు వారికి చెందటం చాలా లాభదాయకమైనదే. కాని, 'నేనొక కార్మికుణ్ణి — నా ప్రక్కయింటి వాడూ ఒక కార్మికుడే — మే మిద్దరమూ కార్మికులమే' అనే విషయాన్నే నేను తెలుసుకోనప్పుడు, "నేనో కుటుంబానికి చెందిన వ్యక్తిని, నాకో కుటుంబం ఉన్నది; దాన్ని పోషించటం, దాన్ని భరించటం మొదలైనవాటికే నా జీవితం పరిమితమైంది; మరో ఇతర కార్మికుడుకూడా ఉన్నాడు, నేనూ కార్మికుణ్ణి కనుక మేమిద్దరం స్వజాతీయులం" అనే జ్ఞానమే నా· లేనప్పుడు నేను

నా సంపత్తి దాన భాగాన్ని ఇతర కార్మికుని కిస్తున్నా నేను నాకంటే భిన్నమైన వాడికే దాన్ని ఇస్తున్నట్టు లెఖ్ఖ. ఇద్దరూ కలిసి, మేమొక్కటి అనే భావాన్ని ముందే కల్పించుకున్నట్లయితే, ఈ మాత్రం చైతన్యం కలిగితే, ఈ మాత్రం విశాలత్వాన్ని పొందితే, అట్టి విశాలత్వం కలిగిన మనుష్యుని కర్తవ్యమేమిటంటే, అంతకన్నా అధిక విశాలత్వాన్ని పొందటానికి భిన్నజాతీయునికి సంపత్తిదానం ఇవ్వాలి.

పళని (మధుర)
20-11-1956

**అనుబంధం - 2**

# సర్వసేవా సంఘ తీర్మానం

## *సంపత్తిదాన వినియోగం*

సంపత్తిదాన వినియోగాన్ని గురించిన చర్చ జరిగింది. సంపత్తి దానాన్ని భూమిహీనులకు సాధనాలు సమకూర్చుట, కార్యకర్తలకు జీవనోపాధి కల్పించుట, సాహిత్యప్రచారము – ఈ మూడు పద్దులకు గాను వెచ్చించాలని వినోబాజీ ఆదేశించారు. సంపత్తిదాన యజ్ఞాన్ని ఇంకా విశాలతరం చేయడానికి గాను, సంపత్తి దానపు ముఖ్య ఉద్దేశాన్ని ప్రజలకు వివరించాలనీ, ఆ తర్వాత దాని వినియోగాన్ని దాత పైనే వదలాలనే ఒక తీర్మానం వచ్చింది. అర్థంచేసుకుని, సంపత్తి దానం ఇచ్చేవారు దాన్ని తప్పుడుమార్గాలలో ఖర్చుపెట్టరనే దృఢ విశ్వాసాన్ని మనం కలిగి ఉండాలి. కార్మికులకూ, విద్యార్థులకూ, తమతమ సంపత్తి దానాలను, తమప్రక్కనే ఉంటున్న బీదలకోసం వినియోగ పరచే అవకాశాన్నివ్వాలి. సిద్ధాంత చర్చలో మరో విషయం ముందుకు వచ్చింది. సంపత్తి దానాన్ని ఏ ఏ పనులకు వినియోగించాలో నిర్ణయం

జరగకపోతే, సంపత్తిదానపు మూలహేతువైన అహింసా ప్రవృత్తి పురోగమనానికి బదులు అదొక మామూలు కార్యక్రమంగానే ఉండి పోతుంది.

చిన్నచిన్న దానాల దాతలు, సంపత్తిదానపు వినియోగాన్ని తమ చుట్టుపట్ల 'దర్శన క్షేత్రం'లోనే చేసుకోగలగటమే ఉచితమని శ్రీ వినోబా అన్నారు. దీనివల్ల క్రాంతి ఉద్యమాన్ని వారు ప్రత్య క్షంగా దర్శించుకొని దాని అనుభూతిని పొందగలుగుతారు. సంపత్తి దానం ప్రత్యేకంగా నిరంకుశంగా వినియోగించబడ్డప్పుడు— అనిష్టము కాకపోయినా— ఇష్టసిద్ధి మాత్రం కాదనే విషయంకూడా సత్యమే. అయితే ఆ 'అంకుశం'అహింసాత్మకం అంటే 'ఆలోచనాత్మకం'కావాలి.

చర్చ తర్వాత సంపత్తిదాన వినియోగాన్ని గూర్చి ఈ క్రింది నిర్ణయం చేయబడింది.

సంపత్తిదానపు మొత్తం 'భూదానమూలక, గ్రామోద్యోగ ప్రధాన, అహింసాత్మక క్రాంతి' యొక్క ఉద్దేశ్యాన్ని సాధించడానికి ఖర్చుచేయబడాలి. ఉదాహరణకు: కొన్ని పద్దులుక్రింద ఇవ్వబడు తున్నాయి. వీనిలో ఏ ఒకదానికి కాని అనేకమైన వానికి గానీ సం పత్తి దానపు ధనాన్ని వినియోగించవచ్చు:—

(1) భూదానయజ్ఞంలో, భూమిని పొందిన భూమి హీనునికి సాధన సామగ్రిని చేకూర్చడం, భూమిని సేద్యంలోనికి తెచ్చుటకు అతనికి ఇతరవిధాలుగా సహాయపడటం.

(2) భూదానయజ్ఞ ఉద్యమపు ఖర్చుకోసం ఉపయోగించడం.

(3) సర్వోదయ సాహిత్య ప్రచారానికి సహకరించడం.

(4) విద్యార్థి వర్గం, లేక కార్మిక వర్గంలోని చిన్నచిన్న దానం చేసే దాతలు తమ తమ పరిస్థితుల్నిబట్టి 'భూదాన యజ్ఞ మూలకమైన' క్రాంతిని పురోగమింపజేసే ఉద్దేశానికి, సామూహికంగా లేక వేరు

వేరుగా ఇతరపనులకు కూడా ఖర్చుచేయవచ్చు. ఈ విషయంలో వారు తమ 'జిల్లా సేవకుని'సలహా పొందవచ్చు.

సంపత్తి దానపు దాత, తన కిష్టంవచ్చిన సార్వజనిక కార్యం కొరకు సంపత్తి దానంలో మూడింట ఒక భాగం వ్యయపరచగలిగే ప్రస్తుతమున్న అవకాశాన్ని అట్లాగే ఉంచటం జరిగింది.

పళని
21–11–56

**అనుబంధం - 3**

## సంపత్తి దానమును గురించి తెలుసుకొన వలసిన సంగతులు

1954 ఏప్రియల్ మాసంలో బుద్ధగయలో జరిగిన సర్వోదయ సమ్మేళనంలో సంపత్తిదాన యజ్ఞమునకు సంబంధించిన చర్చ కొంత వివరంగా జరిగింది. అప్పుడు దాని విషయమై ఒక పత్రము కూడ వెలువడింది. మార్చి 1955 లో పూరీ సమ్మేళనంలో కూడా ఈ విషయమై అధికంగా చర్చించ బడినది. విజయవాడలో డిసెంబరు 1955 లో జరిగిన సర్వ సేవాసంఘ సమావేశంలో ఈ విషయమై కొన్ని నిర్ణయాలు చేయబడినవి. ఈ విధంగా సంపత్తిదాన సిద్ధాంతం ఉత్తరోత్తరా వికసిస్తూ వచ్చింది. పళనిలో 1956 నవంబరు 19 నుండి 22, వరకు జరిగిన సమావేశంలో తంత్రముక్తి, నిధిముక్తి అనే విప్లవకర నిర్ణయాలు చేయబడటంతోపాటు, సంపత్తి దాన యజ్ఞాన్ని గురించి కూడా విశేషంగా చర్చించబడ్డది.

సంపత్తి దానానికి సంబంధించిన సైద్ధాంతిక వివరణ ఇది వరకే వివరించ బడినది. మహాత్మాగాంధీ, వినోబాజీ, శ్రీ జాజూజీ

గార్ల వివరణల వలన భూదాన యజ్ఞపు మూలంలో ఉన్న సిద్ధాంతమే సంపత్తిదాన యజ్ఞం మూలంలోనూ ఉన్నదనే విషయం పూర్తిగా స్పష్టీకరింప బడినది. అంటే, భూమిమీద స్వామిత్వం ఉండకూడదని ఏవిధంగా అంటున్నామో అదే విధంగా సంపత్తిమీద కూడా ఎవరికీ స్వామిత్వహక్కు ఉండకూడదు.

## సంపత్తిదాన స్వరూపం

సంపత్తిని సంపాదించే విషయంలో శరీరశ్రమవల్లనే సంపత్తి లభ్యం అయి ఉండాలి. పీడనకూ, అసమానతలకూ తావుండకూడదు. సంపత్తియొక్క ఉపార్జన, సాధనముకూడా పరిశుద్ధమైనదే అయి వుండాలి.

మనుష్యుని వద్దగల శారీరక, విద్యావిషయిక, ధనసంపత్తి మూలమైన బలం ప్రత్యక్షంగానో పరోక్షంగానో సమాజంనుంచే లభిస్తున్నది. అందువల్ల దానిని సమాజహితం కోసం ఉపయోగించవలెను. సంపత్తి దానపు ఈ సిద్ధాంతాన్ని అమలు పరచుటకు, ప్రథమ పాదంగా సంపత్తిదాన స్వరూపం ఇట్లున్నది. దాత తన ఆదాయంలో ఒక భాగాన్ని, లేక ఏదైనా కారణ వశంగా ఇంటిఖర్చులో ఒక భాగమును సమాజం కోసం అర్పిస్తూ ఉండవలెను. ఆ భాగం వ్యక్తి యొక్క ఆదాయపు పరిమాణమునుబట్టి ఉంటుంది. ఉత్తరోత్తరా అది అధికం కాగలదు.

దరిద్ర నారాయణుని తన కుటుంబంలోని ఒక సభ్యునిగా చేసుకుని, ప్రస్తుతం ఆదాయంలో ఆరవభాగం లేక ఖర్చులో అయిదవ భాగం ఒక సామాన్య పరిమాణముగా ఎంచబడుతుంది.

ఆదాయం అంటే ఇన్‌కమ్‌టాక్సు వగైరా అనివార్యమైన ఖర్చులన్నీ పోగా, అన్ని మార్గములనుండి ప్రాప్తించు మొత్తం ఆదాయముగా భావించబడుతుంది. ఇంటి ఖర్చులో, అన్నపానాదులు,

నివాసము, పిల్లల చదువు, పెండ్లిండ్లు మొదలగు వాని ఖర్చునుకూడా కలుపుకోవలసి ఉంటుంది.

సంపత్తిదానంలో ఆదాయంలోని ఆరవ భాగం అడిగితే, అది ఒక పన్నుగా భావించ బడరాదు. దాత బుద్ధిపూర్వకంగా తన ఆదాయంలోని ఎక్కువ తక్కువ భాగమును కూడా ఇవ్వగలుగుతాడు. కొందరికి ఆదాయం కేవలం జరుగు బాటుకే ఉంటుంది. అట్టివారు కూడా సంపత్తిదాన యజ్ఞంలో తప్పకుండా పాల్గొనవలెను. కాని వారి భాగము సూచన మాత్రంగా వుండగలదు. ఇప్పుడైతే సంపత్తిలో భాగం దానంగా లభ్యమయ్యే ప్రస్తావన వున్నదిగాని, లక్ష్యము సంపత్తి సమాజపరము కావడమే. అట్టి భావనతో, సమాజంవైపు నుంచి తాను సంపత్తికి ధర్మకర్తగా వ్యవహరించుటకు వ్యక్తి సిద్ధం కావలెను. రైతు తన సంపత్తిని ధాన్యరూపంలో ఇవ్వవచ్చును.

## సంపత్తిదానపు వినియోగం

సంపత్తిదానపు ధనాన్ని క్రింద వివరించిన విధంగా దాత స్వయంగానే వినియోగించవచ్చు. కాని ప్రతిసంవత్సరం ఒకసారి దాని లెక్కను తన జిల్లా సర్వోదయ కార్యాలయానికి గాని, సర్వసేవా సంఘానికి గాని పంపవలెను. దాత కోరినట్లయితే, జిల్లా సర్వోదయ కార్యాలయంనుండి గాని, సర్వసేవా సంఘంనుండి గాని అతనికి మార్గదర్శనం లభిస్తుంది. దాత బుద్ధిపూర్వకంగా సంపత్తిదానపు ధనాన్ని వినియోగించే భారం, జిల్లా సర్వోదయ కార్యాలయానికి గాని, సర్వసేవా సంఘానికిగాని అప్పగించవచ్చు. సంపత్తిదానపు ధనాన్ని ఖర్చుపెట్టే విషయంలో వినోబాజీ సలహాను అనుసరించి, సర్వసేవా సంఘం చేసిన నిర్ణయాలు 2 వ అనుబంధంలో ఇవ్వడం జరిగింది.

అయితే సాహిత్య ప్రచారం విషయంలో ఒక మాటను గుర్తుంచుకోవలెను. ఉచితముగా పంచే పద్ధతి ఇందులో పనికిరాదు. స్వల్పమైన వెలకు విక్రయించవలెను. విద్యార్థి బృందము, కార్యకర్తలు వంటి ప్రత్యేక వర్గములకు వెల కొంత తగ్గించి ఇవ్వవచ్చును. సార్వజనిక పఠన మందిరాలకు, గ్రంథాలయాలకు ఉచితంగా ఇవ్వవచ్చును.

## సంపత్తి దానపు కొన్ని ముఖ్యమైన ఉపయోగములు

1. ఒక సవర్ణుడు ఒక హరిజన బాలకుని తన కుటుంబంలో చేర్చుకుని, అతని పూర్తి బాధ్యతను తానే వహిస్తే అట్టి ఖర్చు సంపత్తి దానముగా ఎంచదగును.

2. సంస్థలయందు పనిచేయు కార్యకర్తలు, లేక శిక్షితులు ఒకచోట నివసిస్తూ, తమ గ్రేడులో అంతరం వున్నప్పటికీ, వేతనములు వగైరాలను ఒకచోట చేర్చుకుని, తదుపరి కుటుంబములోని సంఖ్య ప్రకారం పునర్విభజన చేసుకుంటే, అది సంపత్తి దానపు అత్యుత్తమ స్వరూపం కాగలదు. ఈ విధంగా కాగా అందరు కలసి సూచన ప్రాయంగా సంపత్తిదానం ఇవ్వగలరు.

## వివిధ విషయములు

చర్చలో ఇంకొక ప్రశ్న ఉత్పన్నమయినది. అనేక స్థలములందు వ్యాపారులు ఇచ్చి పుచ్చుకోవడంలో విధిగా ధర్మాదాయం వసూలు చేస్తున్నారు. తనవద్ద చేరిన ఆ ధర్మాదాయ రుసుమును సంపత్తిదానంగా వ్యాపారి ఇవ్వవచ్చునా? అటువంటి ద్రవ్యాన్ని సంపత్తిదానంగా ఇవ్వరాదని చర్చ పర్యవసానం.

ఇంకొక ప్రశ్నకూడా కలిగింది. భూమిగలవారు భూదానం ఇవ్వక సంపత్తిదాన మియ్యదలచితే, దానిని స్వీకరించవచ్చునా? స్వీకరించరాదని చర్చలో తేలినది.

## కార్యకర్తలకు సూచనలు

(1) భూదానోద్యమంలో కృషి జేసే ప్రతి కార్యకర్త సంపత్తి దాన యజ్ఞంలో స్వయంగా పాల్గొనవలెను. అతనివద్ద భూమి వుంటే భూదానం చేయవలెను.

(2) భూదానం పొందే ప్రయత్నం జేసే తావున సంపత్తిదానం పొందే ప్రయత్నం కూడా జరగవలెను.

(3) భూమినిచ్చిన దాతలు సంపత్తిదాన యజ్ఞంలో గూడా చేరవలెనని మనం గుర్తుంచుకోవలెను.

(4) మనం సాధారణంగా ధనవంతులు, మధ్య తరగతివారు-ఇట్టివారివద్ద సంపత్తిదానమును పొందుటకు ప్రయత్నం చేస్తున్నాము. పేదలవద్దనుంచి కూడా సంపత్తిదానం పొందే ప్రయత్నం జేయవలెను. వారిచ్చే దానం అత్యల్పంగానే వుంటుంది. కాని దాని వలన ఈ ఉద్యమానికి అనుకూల వాతావరణం విస్తారంగా కలుగుతుంది. దాని ప్రభావం అందరిమీద పడుతుంది.

(5) పైన తెలియజేసినట్లుగానే, కేవలం జరుగుబాటు మాత్రం అయ్యే జీవనభృతి వున్నప్పటికి, అట్టివారు కూడా సంపత్తిదాన యజ్ఞంలో చేరవలెను. కాని పేదలదానం సంజ్ఞామాత్రంగానే వుండవలెను. పేదలు 50 వ, 30 వ, 20 వ భాగముల వరకు తమ ఆదాయాన్ననుసరించి ఇవ్వగలరు.

(6) సంపత్తిదానము, సాధనదానము— రెంటి కొరకు ఒకేసారి ప్రయత్నం జేయడంలో కొన్ని చిక్కులు కలుగుతున్నవి. సాధన దానపు ఆవశ్యకత మనకు అత్యధికం. వ్యక్తిగతంగా లేక సభలో సామూహికంగా మనం ప్రయత్నించేటపుడు సాధనదానం సులభం గనక దానిని స్వీకరించడం; సంపత్తి దానం సంగతి మూలకు పడి పోవడం జరుగుతున్నది. సంపత్తిదానము కొంచెం లోతైన విషయం.

మన ఆందోళనలో దానికి ఒక మహత్వపూర్ణమైన స్థానం గ
దానితో పోలిస్తే సాధనదానము అల్పమైనది. సంపత్తిదాన మ
బాధ కలుగుతుంది అనే మాట పనికిరాదు. అందువల్ల ఈ విధ
జేస్తే మంచిది. భూమిని పంచేటప్పుడు, అక్కడ చేరిన వారి
సాధనదానం అడగవలెను. ఒక్క సంవత్సరం వరకు భూగ్రహీ
సదుపాయం కలిగేటట్లు చూడవలెను. ఆ పిమ్మట మిగిలిన సభల
ఇతర స్థలములందు, అవకాశములందు సంపత్తిదానం మీదనే
వహించదగును.

(7) దాత తన ఆదాయమును సంపత్తిదాన భాగమును
వేసి దానిని గుప్తముగా వుంచవలసిందని కోరేయెడల, కార్య
సావధాన చిత్తుడై అట్లే వానిని స్వీకరించవలెను. ప్రాం
భూదాన సమితి కార్యాలయంలో ఒక రిజిస్టర్ ఈ గుప్తదానం కొ
వుండవలెను. దానిని భూదాన సమితి ముఖ్యుడు మాత్రమే
లించగలడు.

## విజ్ఞప్తి

అందరు సంపత్తి దానంలో చేరవలెనని ప్రార్థన. పేదలు
ధనవంతులుగానీ, రాజ్యాధికారం గలవారుగానీ, సర్కార్ అ
రులు గానీ, వ్యాపారులుగానీ, ఉద్యోగము లేక వృత్తియ
ముఖ్యులుగానీ, బుద్ధిప్రధానంగా గల వృత్తులు చేసేవారు గానీ, అ
ఇందులో చేరవలెను. బుద్ధి జీవులు మరింత శ్రద్ధ వహించెదరని
విశ్వాసం. మంత్రిమండలి, శాసన సభ్యులు, రాజనైతిక, సామ
రంగములలోని నాయకగణం, సమాజహితం కొరకు అధికంగా
బ్ధారీని వహించవలసినవారై వున్నారు. అందువల్ల వారు స
రించుట అవశ్యం. తాము ఇందులో చేరి, ఇతరులను చేర్పించ
ప్రేరణను పొందుదురుగాక !

# భూదాన సాహిత్యము

| | | రు.న.పై |
|---|---|---|
| గీతా ప్రవచనములు | వినోబా | 1·00 |
| శిక్షణ విచారధార | ,, | 1·50 |
| సాహిత్యం-సాహితీవేత్తలు | ,, | 0·65 |
| ప్రజావిప్లవ పథము | ,, | 0·50 |
| వర్తకులకు పిలుపు | ,, | 0·15 |
| కార్మికులారా! కదలండి! | వినోబా & జయప్రకాశ్ నారాయణ్ | 0·15 |
| వినోబా జీవితం | లవణం | 0·20 |
| విద్యార్థులారా రండి | ,, | 0·15 |
| సంపత్తి దానము | శ్రీకృష్ణదాస్ జాజూ | 0·50 |
| వినోబా సన్నిధిలో | నిర్మల దేశపాండే | 1·25 |
| భూదాన ఆరోహణము | నారాయణ దేశాయి | 0·75 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0·50 |
| విప్లవ పురోగమనము | దాదా ధర్మాధికారి | 0·30 |

ధనమునకు గల విలువ దానివల్ల ప్రజలనుండి పరిశ్రమను పొందుటపై ఆధారపడి యున్నదని తెలుసుకున్నాము. పరిశ్రమ ఊరికే లభిస్తే ధనము అవసరమే ఉండదు. డబ్బు అవసరం లేకుండానే ప్రజల పరిశ్రమ లభించ గలుగుతుంది.........ధన బలము కంటె నీతి బలం ఎక్కువ పని చేస్తుంది. డబ్బు పని చేయలేనిచోట, నీతి బలం పని చేయగలదు.

మానవులనుండి పరిశ్రమను పొందగల శక్తియే ధనమని మనం అంగీకరిస్తే, ఆ వ్యక్తులు ఎంత చురుకుగలవారు, నీతివంతులు అయితే అంతగా సంపద పెరగ గలదని మనం చూడగలము. ఈ విధంగా ఆలోచిస్తే, అసలైన సంపద వెండి, బంగారాలు కాక, మానవుడే నిజమైన సంపద అని తేలగలదు. ధనము కొరకు అన్వేషణ భూమి లోపల కాక, మానవ హృదయమందు చేయవలసియున్నది.

—గాంధీజీ